# కాంగ్రెసేయుల స్వేచ్ఛ
# స్వతంత్రుల స్వతంత్రత
# సోషలిస్టుల విషయం

రాజధాని కబుర్లు

పి. శ్రీ

పెళ్ళిళ్ళు స్వర్గలోకంలో నిశ్చయింపబడతాయట. ఇంగ్లీషువాళ్ళు అంటారు. విడాకులు మాత్రం ఈ లోకంలోనే తేల్తాయి. కాదు, ముంచుతాయ్! స్వర్గానికి కబురంపకుండా పెళ్ళిళ్ళుచేసుకోడానికి ఇక్కడ తమకు హక్కులు ఇచ్చేసుకుంటే మాత్రం, అక్కడే విడాకులిప్పించే ఏర్పాట్లు చేసేస్తారు.

ఇదే విధంగా నేడు రాష్ట్రాల 'కళ్యాణం' కొత్త ఢిల్లీ ఆశీర్వచనంపై ఆధారపడి ఉంటుంది. ఆ ఆశీర్వచనం లేకుండా, దేశంలో 'ప్రకాశిద్దామంటే' కుదరదు. ఈ పరిస్థితిని ఎదుర్కొనే సంజీవ మంత్రం లేదు. కేంద్రం ఆజ్ఞాపించనిదే ఆనందపడ్డానికి కుదరదు.

నాయకులు అనేక విధాలుగా ఉంటారు. ప్రజల మధ్యకు పోనివారు కొందరుంటారు. ప్రజలమధ్య పుట్టి, పెరిగినవారు కొందరుంటారు. ప్రజలమధ్య పుట్టి, పత్రికల పుటల్లో పెరిగినవారు మరి కొందరుంటారు. ప్రజల మధ్య పుట్టి, పత్రికల పుటల్లో పెరిగి, ఇవి రెండూ కాదని, ఢిల్లీ చలికి వణికి, ఢిల్లీ ఎండకి కాగి, ఆకాశంనుంచి దిగొచ్చినట్టు దిగొచ్చేవారు మరికొందరుంటారు. ఇక్కడ వాతావరణం బాగుండకపోతే, విమానం క్రిందకు దిగదు. బయలుదేరిన చోటికే తిరిగిపోతుంది.

'రాష్ట్రకాంగ్రెసు శాసనసభాపక్ష నాయకత్వం ఎవరు వహించాలి?' అన్న విషయంపై రాజధానిలో తర్జనభర్జనలు జరుగుతున్నాయి. శాసనసభ సమావేశాలు జరుగుతూనే ఉన్నా, సభ్యులలో పలువురు లాబీల్లోను, కేంటీన్‌లోను, ఉద్యానవనాల్లోను రహస్యంగా చర్చించుకుంటూ కనబడుతున్నారు. బహిరంగంగా చర్చలు సాగించలేని పరిస్థితి నేటికైనా కాంగ్రెసుపక్షానికి రావడం ముదావహమైన విషయం. క్రమశిక్షణ అనేది కాంగ్రెసువారికికూడా అలవడుతోంది.

* * *

గత ఆదివారం ఉదయం రాష్ట్రశాసనసభ కాంగ్రెసుపక్షం సమావేశమై శ్రీ సంజీవరెడ్డి ఇప్పట్లో రాజీనామా ఇవ్వనవసరం లేదని తీర్మానించింది. రాజధానిలోని రాజకీయపరిణామాలను శ్రద్ధతో పరిశీలిస్తున్న వారికి ఈ తీర్మానం ఆశ్చర్యకారణమైంది. కాని–అంతకంటె ఆశ్చర్యకరమైన వార్త సోమవారంనాడు వెలువడింది. సచివాలయ సిబ్బంది జరిపిన సాంస్కృతిక కార్యక్రమాలకు ప్రారంభోత్సవం చేస్తూ, ముఖ్యమంత్రి ఒక నెలలోపునే ఈ పదవిని త్యజించవలసి వస్తుందని ప్రకటించారు. బెంగుళూరు కాంగ్రెసు సమావేశం తర్వాత తాను ముఖ్యమంత్రిగా ఉండడం అసంభవం అన్నారు.

ముఖ్యమంత్రిగా తాను కొందరి మనస్సులకు కష్టం కలిగించవలసి వచ్చినందుకు శ్రీ సంజీవరెడ్డి క్షమాపణ చెప్పుకున్నారు. సమర్థుడైనవాడు ఎవడు పదవి స్వీకరించినా ఆదర్శాలను డ్రాయింగు రూమ్‌లో కూచోపెట్టి ఆదరణకు ఆఫీసులో స్థానం ఇవ్వవలసిందే. ఈ విధంగా ఆలోచిస్తే, ఎవరు ఆ పదవి స్వీకరించినా ఒకటే కాని సమర్థతలోను, నిజాయితీలోను వ్యక్తులమధ్య తరతమ భేదాలు తప్పవు. కనుక 'ఎవరు ముఖ్యమంత్రి?' అన్న ప్రశ్నకు ప్రజలు ప్రాధాన్యం ఇస్తూనే ఉన్నారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి చిదానందమూర్తి. ఆర్థిక మంత్రిగా ఉండి, ఇంద్రజాలికుడుగా పేరు గడించుకున్నారు. శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుని కాంగ్రెసు అధిష్ఠానవర్గం సమర్థిస్తూందని ఢిల్లీనుంచి పి. టి. ఐ. సంస్థ కబురంపింది. వీరిరువురిలో ఎవరు మనకి ముఖ్యమంత్రి అని ప్రశ్నించుకొంటున్న తరుణంలో, తెలంగాణాపిత శ్రీ కొండా వెంకటరంగారెడ్డి తెలంగాణీయులకే ముఖ్యమంత్రి పదవి లభించాలని ప్రకటించారు. బూర్గుల వారింకా కేరళ రాష్ట్రంలోనే పనిచేస్తూ ఉండడంవల్ల, తెలంగాణా నాయకునికి ముఖ్యమంత్రి పదవి లభ్యమైతే, శ్రీరంగారెడ్డికే లభ్యంకావాలి.

ఏది ఎలా ఉన్నా, జనవరి మొదటివారానికి ప్రశ్నకు సరైన సమాధానం తేలిపోతుంది. ఈలోగా ఈ వారంలో కొత్తఢిల్లీలో జరిగే కాంగ్రెసు కార్యవర్గంలోనే తాంబూలాలిచ్చుకోవడం జరిగిపోవచ్చు!

## స్వతంత్రులు!

ఇంత దూరంవరకు మేము ఆలోచించగలం అనుకుంటూ, అందులో సగం దూరమే ఆలోచించగలిగేవారు కొందరుంటే, తాము ఆలోచించినంతలో సగం దూరమే ఎదుటివారిని ఆలోచించనిచ్చే పెద్దలు కొందరుంటారు. ఈ రెండో తరహా పెద్దమనిషి శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారి.

'మనకు రాజభాష ఏది కావాలి – ఇంగ్లీషా? హిందీయా?'–ఈ ప్రశ్నను ఉదాహరణగా తీసుకోండి. భారతదేశంలో పధ్నాలుగు ప్రధానభాషలు ప్రాంతీయ భాషలుగా గుర్తించబడుతున్నాయ్. అధికసంఖ్యాకుల మాతృభాష హిందీభాష. కనుక హిందీ భారతదేశానికి రాజభాష కావాలని, ఇంగ్లీషు భాషని నీటుగా బంగీకట్టి ఇంగ్లండుకి పంపించేయాలని హిందీ భాషోన్మాదులు అంటారు. దీనికి సమాధానం చెప్పారు రాజాజీ. నూటికి ఒకరే ఇంగ్లీషు మాటాడగల్గినవారు దేశంలో ఉన్న మాట నిజమేఐనా, ఆ కొద్దిమంది దేశమంతా వ్యాపించి ఉన్నారన్నారు రాజాజీ. హిందీమాతృభాషగా గలవారు కొన్నిరాష్ట్రాలలోనే కదా ఉన్నది? ఈ వాక్యాలు గత

సంవత్సరం లేడీ హైదరీ క్లబ్ ఆవరణలో రాజాజీ పలికినప్పుడు, హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి. కాని రాజాజీ చెప్పడం మరచిపోయిన విషయం ఒకటుంది: ఆ కొద్దిమందిలో చాలమంది మదరాసు రాష్ట్రంలోనే ఉన్నారు. ఢిల్లీ వెళ్ళినా, మదరాసు, సేలం, కుంభకోణం మరచిపోలేరు రాజాజీ.

ఈ వారం రాజాజీ హైదరాబాదు వచ్చారు. సరోజినీదేవి హాలులో జరిగిన స్వతంత్ర మహిళల సమావేశంలో ప్రసంగిస్తూ, వెయ్యిమంది ఆడవాళ్ళు తనను సమర్థిస్తే నిముషంలో భారత ప్రభుత్వాన్ని తలక్రిందులు చేస్తామన్నారు. ఇది హాస్యప్రకోపం అన్న మాటలు కావనికూడా అన్నారు. పొగిడితే ఆడవాళ్ళు సంతోషిస్తారు. ఆ పొగడ్త పొగడ్త కాదనడంకూడా పొగడ్తే కదా! మరి సంతోషించారు స్వతంత్ర మహిళలు.

స్వతంత్రపార్టీ సమావేశాలు ప్రకాశగిరీ కోఠీలో జరిగాయి. అనేక విషయాలపై తీర్మానాలు చేయబడ్డాయి. కార్యవర్గ సభ్యులపేర్లుకూడా ప్రకటింపబడ్డాయి. శ్రీ కృష్ణస్వామి సంయుక్త కార్యదర్శిగా నియమింపబడినట్లు ప్రకటించబడింది. ఆయన పేరు ఆ పదవికి సూచింపబడినప్పుడు, రాజాజీ మెల్లిగా 'అసలాపదవి అనవసరమేమో!' అన్నారట. అన్నారని వినికిడి. ఇరవై నాలుగు గంటలు తిరక్కుండా, శ్రీ కృష్ణస్వామి తమ పదవికి రాజీనామా ఇచ్చి, విమానం ఎక్కారు.

ఇది 'స్వతంత్రుల' విషయం.

## 'సోషలిస్టులు'

మరి సోషలిస్టు లున్నారు. వీరిని ఎవరో ఒకసారి 'కంఠశోషలిస్టులు' అన్నారు. కంఠం తీసేసినా, శోషలిస్టులు అనచ్చు మనం.

రాష్ట్రశాసనసభలోని సోషలిస్టు వర్గం, రాష్ట్రంలోని సోషలిస్టు పక్షం [illegible] కాంగ్రెసులో చేరిపోయాయి. కాంగ్రెసు సోషలిస్టులు సోషలిస్టులై, ప్రజా సోషలిస్టులై, లోహియా నాయకత్వంక్రింద ప్రజలని వదిలించుకొని సోషలిస్టులైనారు. లోహియాతో చీలి, ఆంధ్రలో మరో సోషలిస్టు పక్షం ఏర్పడింది. శాసనసభలో ప్రభుత్వాన్ని నిశితంగానేకాక చక్కని భాషలో విమర్శించగల సభ్యులు ఈవర్గంలో ఉండేవారు. ఈ వర్గం ఇప్పుడు కాంగ్రెసులో చేరడంతో కంఠశోషలిస్టులన్న పేరు స్థిరపడిపోయేటట్లు కనిపిస్తుంది. [illegible] శ్రీ పి.వి.జి.రాజు ఈపక్షానికి నాయకుడు. ఆయన రాజరికం స్వీకరించే ఛాయలు కనుపిస్తున్నాయి ఇప్పుడు.

## 'కంచె చేను మేస్తే ...?'

కంచెకున్న ముళ్లు మాత్రం చూసి చిన్నపిల్లలు, నోరులేని కంచె చేను ఎల మేస్తుందని ఆశ్చర్య పడుతూంటారు. వాళ్లకి ప్రభుత్వ వ్యవస్థ అంతగ తెలియదు గదా?

అకౌంటెంట్ జనరల్ కార్యాలయానికి 'లోకల్ ఆడిట్' శాఖ ఒకటి ఉంది. ఈ శాఖకు చెందిన ఉద్యోగులు రాజధానిలోను, ఇతరత్రా ఉన్న ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్ళి అంకెలు తనిఖీ చేస్తూంటారు. తనిఖీకి వచ్చిన అధికారులు తమ అధికారాలు ప్రకటించుకోడం ఆచారం. ఇది రాజధానిలో ఉన్నప్పుడు తక్కువే కాని, హైదరాబాదు విడిచి జిల్లాకేంద్రాలకు వెళ్ళినప్పుడు శ్రుతిమించి రాగానపడుతుంది.

ఈ జట్లు ఆసుపత్రులకు వెళ్ళినప్పుడు కళ్ళపరీక్షదగ్గరనుంచి శస్త్రచికిత్సల వరకు ఉచితంగా చేయించుకోవడం ఆచారం. ఇతర కార్యాలయాలకు వెళ్ళినప్పుడు కూడా రాజలాంఛనాలతో స్వాగతం వాంఛించడం. అది లభ్యంకానప్పుడు ఈ కార్యాలయాలను గురించి నిందాపూరితమైన నివేదికలు పంపడం అలవాటు. టెలిఫోన్‌లు ఉపయోగించుకొని, పంతికం పెట్టుమంటే, అంత చూస్తామన్నట్లు ముందుపడి చూడ్డం అలవాటు. ఎన్నో వార్తలు ఇటువంటి తనిఖీలపై వస్తున్నాయి. వరోసారి, మరోమారు, తీరిక ఉన్నప్పుడు పరిశీలించవలసిన విషయం ఇది. ఈలోగా మన పరిపాలకు



కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైనందుకు తమ గౌరవార్థం మద్రాసులో జరిగిన విందు సందర్భంలో అభినందనలకు సమాధాన మిస్తున్న శ్రీ సంజీవరెడ్డి, వారిప్రక్కన

వెన్నతో పెట్టిన విద్యలన్నారు. 'మేము అనేక నష్టాలు ఎదుర్కొన్నాం, కాని ఓటమి ఎరుగం' అన్నారు శ్రీ నెహ్రూ.

ప్రాచీన భారతీయ చరిత్ర శ్రీ నెహ్రూకు బాగా తెలుసు. అందులో ఆయన నిపుణులు. ఆ చరిత్ర చెప్పేదొక్కటే! భారతీయులు పొందినవన్నీ పరాభవాలేనని వారికి మిగిలింది నాశనమని! భారతీయులకు తగిలిన మొదటి దెబ్బ అలెగ్జాండర్ చేతిమీదుగా తగిలింది. మహమ్మద్ ఘజ్నీవి అనే దేశద్రిమ్మరి పదిహేడుసార్లు భారత్ ను కొల్లగొట్టడం జరిగింది. తరువాత మహమ్మద్ ఘోరీ ఢిల్లీ వచ్చి రెండు వేలమంది ముస్లిములతో మహమ్మదీయ సామ్రాజ్యం స్థాపించాడు. తరువాత బ్రిటిష్ వారు, ప్రస్తుతం ఇక చైనీయులు కూడా భారత్ పై దండయాత్రలు చేసినవారే! కొల్లగొట్టిన వారే! ప్రణాళికా సంఘంవారి పరిశీలకవర్గాల నివేదికలు 'మనసిరిసంపదలకు' చక్కని నిదర్శనాలు. మన కలిమి కేవలం నివేదికలకే పరిమితం.

శ్రీ నెహ్రూతో వచ్చిన ఇబ్బంది ఒక్కటే. జనసందోహం కంటికి కనిపించగానే ఆయన నాలుక ఊరుకోదు. ఆయన ఏం మాట్లాడేదీ కూడా తెలియకుండా అదుపులేకుండా మాట్లాడేస్తారు. ముఖ్యంగా రామలీల మైదానంలో జనం కనిపిస్తే చాలు ఆయన మాటలకు శ్రుతి, లయ, మితి ఉండనే ఉండవు. అనూచానంగా వస్తున్న కాయకష్టం భారతీయులు ఈనాడు విస్మరించడానికి శ్రీ నెహ్రూ పరిపాలనాపద్ధతులే కారణం. పర్వతాలు ఆరోహించడం, నదులు లంఘించడం శ్రీ నెహ్రూకు అలవాటు కావచ్చు గాక! కాని తన దేశస్థులకు ఎందుకా ఈ అలవాటు లేదని ఆయనకు బాగా తెలుసు! లేదా తెలుసుకోవాలి.

ఏప్రిల్ లో లడక్ ప్రాంతంలో మంచు కరిగి మనుషులు తిరగడానికి వీలవుతుంది. అప్పుడు తిరిగి చైనీయులు విజృంభించేవరకు శ్రీ నెహ్రూకు ధైర్యంగా ఉండమని స్ఫూర్తి వస్తారనిపిస్తుంది ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్. మొత్తానికి శ్రీ నెహ్రూ ఉపన్యాసాలవల్ల అమెరికన్ ఎన్నికలలో మరొక్క సారి రిపబ్లికన్లు గెలిచే అవకాశం ఏర్పడిందనవచ్చు.

* * *

పార్లమెంటులో కొన్ని ప్రశ్నలకు సమాధానాలిస్తూ రైల్వేల ఉపమంత్రి పశ్చిమ, ఉత్తర, ఈశాన్య రైల్వేలపై (మాత్రమే) నేరాలు బాగా ఎక్కువయినవని ఒప్పుకున్నారు.

ఈ మధ్య ఏడు బందిపోటు దొంగతనాలు, ఆరు హత్యలూ, ముప్పైనాలుగు చోరీలు జరిగాయి. 7,86,808 రూపాయిల నష్టం సంభవించింది.

కొన్ని అనుబంధ ప్రశ్నలకు మంత్రి సమాధానం ఇస్తూ ప్రస్తుతం అమల్లో ఉన్న శిక్షాస్మృతులవల్ల ఈ నేరాలు విరివిగా జరుగుతున్నాయని వెల్లడించారు. ఏ ప్రాంతంలో రైలు పోతున్నదో ఆ రాష్ట్రానికి ప్రయాణీకుల రక్షణ బాధ్యతలుండడం దీనికొక ముఖ్యకారణం. బ్రిటిష్ పరిపాలన రోజులలో రక్షణ నిబంధనలు ఇప్పటికన్న కట్టుదిట్టంగా లేవంటూ శ్రీ మహావీర్ త్యాగి తన స్థానంలోనుంచి గట్టిగా బల్లగుద్ది చెప్పడం విచారకరం. ఆడవారిపై అత్యాచారాలు, హత్యలు మొదలయిన నేరాలపై సభ్యులు తీవ్ర ఆందోళన వ్యక్తం చేశారు. రైల్వే ఆస్తులు కాపాడడానికే రైల్వే పోలీసులు నియుక్తులైనారని కూడా ఉప మంత్రి పేర్కొన్నారు. దీనిపై తర్జన భర్జన జరిగేలోగా అసలు ఉప మంత్రి సభనుంచే గైరుహాజరయ్యారు.

* * *

మరొక ప్రశ్నకు సమాధానమిస్తూ సమాచార శాఖామంత్రి డాక్టర్ బి. వి. కేస్కర్ వార్తా పత్రికలకు ప్రభుత్వం ధన సహాయం చేయడమంటూ జరుగదన్నారు. అఖిల భారత హిందీ వార్తా పత్రికల సంఘం నుంచి ఇందు విషయమై తనకెట్టి రాయబారం రాలేదని, ఆ సంఘం కార్యదర్శి తనవద్దకు వచ్చినట్లు చేసిన పత్రికా ప్రకటన మాత్రం చూశానని శ్రీ కేస్కర్ వెల్లడించారు. చిన్న తరహా వార్తా పత్రికలపై ప్రభుత్వం సానుభూతి వహించి సహాయం చేయగలదని ఆయన ప్రకటించారు.

దీనివల్ల ఒక ముఖ్యవిషయం బయటికి వస్తున్నది. పార్లమెంటులో వార్తా పత్రికల 'లాబీ' వర్గం ఒకటి వున్న సంగతి నలుగురికీ తెలిసింది. చిన్న తరహా లేక మూసివేసే స్థితి ఏర్పడిన వార్తా పత్రికలకు ఆర్థిక సహాయం సాధించడం ఈ 'లాబీ' ఉద్దేశ్యం. అటువంటి సహాయాలు పొందడం జరుగుతే ఇక పత్రికా స్వాతంత్ర్యం ఎక్కడ ఉంటుంది?

ఇంకొక ప్రశ్నకు సమాధానమిస్తూ తంతి తపాలాశాఖమంత్రి రూర్కెలాలో పోస్టల్ ఉద్యోగులు నవంబరు 3 నుంచి 6 వ, తేదీలోగా ఉన్నవారిలో దాదాపు అందరూ అనారోగ్య కారణాలంటూ సర్టిఫికేట్లు చూపి సెలవులు పెట్టారని వెల్లడించారు.

దీనితో ముఖ్యమైన పనులన్నీ తపాలా కార్యాలయం టిక్కెట్లవద్ద జరిపి, వాలంటీర్లను బ్రతిమాలి ఇళ్లకు ఉత్తరాలు పంపుకోవడం జరిగిందట!

ఈ సర్టిఫికేట్లు ఇచ్చినది ప్రభుత్వ వైద్యులే! ఇందుపై విచారణ జరుగుతున్నది. బాధ్యతాయుతులైన ప్రభుత్వ వైద్యులు ఇలాంటి సర్టిఫికేట్లు ఇవ్వడం ఇదే ప్రథమం కాదు. ఉత్తరప్రదేశ్ లో మునుపు ఇలాగే జరుగుతే వైద్యులను తీవ్రంగా ప్రభుత్వం హెచ్చరించింది.

డబ్బు లేకుండా వైద్యులు సర్టిఫికేట్లు యివ్వరు. వారు చాలా డబ్బు చేసుకుంటారు. వైద్యులు కారమై కంటగించే మందు లివ్వడంలో సిద్ధహస్తులు. అటువంటి మందే కాస్త ఘాటయినది వారికీ పడడం ఎంతైనా అవసరం.

## చైనీయుల అమానుష చర్యలు

లడక్ లోని కొంగ్ కా కనుమ వద్ద అక్టోబరు 21 వ తేదీన చైనావారు కాల్పులు జరిపి, ఖైదీలుగా పట్టుకున్న భారతీయ పోలీసు బృందం వారిని ఎంత అమానుషంగా బాధ పెట్టిందీ వివరిస్తూ, పోలీసు బృందం నాయకుడు శ్రీ కరం సింగ్ ఈ మధ్య ఒక ప్రకటన చేశారు. ఈయనను నవంబరు 14 వ తేదీన చైనావారు విడుదలచేశారు. ఈయన మంచు దెబ్బకు గురియై ఇంకా చికిత్స పొందుతూనే ఉన్నారు.

మొట్టమొదట కాల్పులు సాగించింది భారతీయ పోలీసులేనని, చైనా వారి గుర్రాలను కూడా వారు దొంగిలించారని, ఇలాగే మరికొన్ని చేయని పనులు చేశారని ఖైదీల చేతే ఒప్పించి వాఙ్మూలాలు తీసుకోడానికి చైనా అధికారులు అమానుష చర్యలకు దిగారట. దాదాపు 70 గంటలసేపు ఖైదీలను ప్రశ్నలతో వేధించి తమకు నచ్చిన సమాధానాలు వచ్చిన దాకా ఇబ్బంది పెట్టారట. ఖైదీలు మంచుకు తట్టుకోలేక జబ్బుపడితే వైద్య సహాయమైనా ఇవ్వటానికి నిరాకరించారట. ఒకరోజు రోజంతా మంచులో, చలిలో బరువు లెత్తించి నడిపించి రాత్రికి అందర్నీ కలిపి 6 అడుగుల లోతు, 7 అడుగులు వెడల్పు, 15 అడుగుల పొడుగు ఉన్న ఒకగోతిలో ఉంచేశారు. ఆరాత్రి అంతా విపరీతమైన చలి. తినటానికి, తాగటానికి కూడా ఏమీ ఇవ్వకుండా, ఆఖరికి దేహబాధ తీర్చుకోటానికి కూడా అనుమతించకుండా బాధ పెట్టారట. కమ్యూనిస్టు పరిపాలన చాలా మంచిదనీ, భారత ప్రభుత్వపాలన అధ్వాన్నమైనదనీ ఖైదీలకు నచ్చచెప్పటానికి ప్రయత్నించారట. బలాత్కారంగా వాఙ్మూలాలమీద సంతకాలు చేయించుకోవడమే కాక, జరిగిన సంఘటనను తమకు అనుకూలంగా ఉండే విధంగా మళ్లీ అభినయింపచేసి ఫోటోగ్రాఫ్ చేశారట.



# క్రిస్మస్ కథ

**శాంతంగా ఉంది. గాలి మెల్లగా వీస్తోంది. తల్లిప్రేమలా చల్లగా వీస్తోంది. దయలా మృదువుగా వీస్తోంది. చాలా హాయిగా ఉంది.**

మైకేల్ కొండ చరియలో దారి పక్కన కూర్చున్నాడు. మైకేల్ గొర్రెపిల్ల అతన్ని గాదుపుకుని పడుకుంది. దాని పేరు కూడా మైకేలే. ప్రేమగా, దాని తెల్లటి మెత్తటి బొచ్చును నిమురుతూ ఆకాశంలోకి చూస్తున్నాడు మైకేల్.

దూరంగా ఆకాశంలో పెద్ద నక్షత్రం కనపడింది. చందమామ అంత పెద్దది. తెల్లటి కాంతితో ధగధగ మెరిసిపోతోంది. దాని కాంతికిరణం ఒకటి భూమిమీదకు దిగుతున్నట్టుంది. ఆ కిరణం మీదనే అది నడుస్తున్నట్టుంది. అంత పెద్ద నక్షత్రాన్ని— ప్రకాశవంతమైన దాన్ని మైకేల్ ఎప్పుడూ చూడలేదు. అమ్మతో చెప్పాలి అనుకున్నాడు, కళ్ళు విప్పార్చి చూస్తూ. ఆ తార అలావెళ్ళి బెత్లెహేం పట్టణంలో ఒక గోశాలమీద ఆగింది.

ఆకాశంలో దేవదుందుభులు మోగాయి. మైకేల్ తలపైకెత్తి చూశాడు. ఎవరో గట్టిగా పాడుతున్నారు. వాద్యాలు వినబడుతున్నాయి. ఆకాశం భూమీ మారుమోగిపోయాయి.

మైకేల్ ఒడిలో గొర్రెపిల్ల మేలుకొని భయంతో అరిచింది.

మైకేల్ కు కూడా భయం వేసింది.

అంతలో మళ్ళీ పాట వినబడింది. పాట తేటగా ఉంది. తీయగా ఉంది. హాయిగా ఉంది.

దేవుడు భూమి మీద అవతరించాడు. మంచి వాళ్ళంతా ఆదరించి సంతోషించండి అని హెచ్చెరుక చెప్పింది ఆ పాట.

గొర్రెపిల్ల లేచి చెంగున గంతు వేసి బెత్లెహెంవైపు పరుగెత్తింది. మైకేల్ కూడా



క్రీస్తు జననం

## "తండ్రీ! వారేమి చేస్తున్నారో వా రెరుగరు అందుచేత వారిని క్షమించు"



దానివెంట పరుగెత్తాడు. దారిలో మైకేల్ కు ముగ్గురు పెద్దవాళ్లు కనిపించారు. వాళ్ళు ఒంటెలమీద వెళ్తున్నారు. దేవుడుపుట్టాడు దేవుడుపుట్టాడు. అదిగో ఆతార దారిచూపుతోంది. మేము దేవుడిని చూడబోతున్నాం మానీ కానుకలు ఇచ్చి సేవించబోతున్నాం అని చెప్పారు వాళ్ళు

మైకేల్ తన గొర్రెపిల్లను ఎత్తుకుని వారివెంటనే పరుగెత్తుకు వెళ్ళాడు.

దేవుడికి కానుక లివ్వడానికి నా దగ్గర ఏమీలేద ఈగొర్రెపిల్ల తప్ప-అనుకున్నాడు మైకేల్.

బెత్లెహెం పట్టణంలో పెద్దవాళ్లుముగ్గురూ ఎవరెవరితోనో మాట్లాడి దారి తెలుసుకున్నారు. అప్పుడు అందరూ కలసి ఒక గోశాల దగ్గరకు వెళ్ళారు. అక్కడ అంతా కాంతిగా ఉంది. అక్కడ నిల్చుంటేనే ఎలాగో ఉంది. ఎంతో బాగుంది.

గోపాలకుడు మైకేల్, లోపలికి తొంగి చూశాడు. తొట్టిలో ఒకపాప ధగధగా మెరిసిపోతున్నాడు. పక్కన వాళ్ళమ్మ ఉంది. దేవదూతలు దండం పెడుతున్నారు. మైకేల్ తో వచ్చిన ముగ్గురూ తొట్టిలో దేవుడికి వందనం చేశారు. కానుకలు ఇచ్చారు.

మైకేల్ ఇవతలికివచ్చి ఆలోచించుకొన్నాడు. తను ముద్దుగా పెంచుకొంటున్న గొర్రెపిల్లను ఎత్తుకొని వెళ్లాడు.

నాదగ్గిర ఇంకేమీ లేదు. ఇదిగో ఈ గొర్రె ఒక్కటేఉంది. చాలామంచిది. దీని ఉన్ని కూడా బాగుంటుంది. తెల్లగా మెత్తగా ఉంటుంది. దేవుడికి మంచికంబళీ నేయించవచ్చు. ఇది ఇస్తాను అన్నాడు

పెద్దాయన గొర్రెపిల్ల మైకేల్ ను అందుకొని, మైకేల్ వీపు తట్టాడు ఆనందంగా.

నాయనా నువ్విచ్చిన కానుక గొప్పది. మా కానుకలకన్న ఎంతోగొప్పది. మేము ఉన్నంతలో కొంత తెచ్చాము. నీవు ఉన్నదంతా ప్రభువుకే సమర్పించావు. మా ముగ్గురికన్న బుద్ధిమంతుడివి. ధన్యుడివి అన్నాడు.

మైకేల్ కి ఇదంతా అర్థంకాలేదు కాని చాలా సంతోషం వేసింది. దేవుడు తన కానుక తీసుకుంటున్నాడు అని పొంగిపోయాడు. ఆ మొట్టమొదటి క్రిస్ట్మస్ పండుగనాడు. మైకేల్ ఇచ్చిన ఉన్నితోనే జీసస్ కు మొట్టమొదటి కొత్తదుప్పటి నేశారు.

* * *

ఇశ్రేలీలను దాస్యంనుండివిడిపించి,ధర్మం చెప్పి జీవనవిధానాలు శాసించి దారినపెట్టిన మోసెస్ అస్తమించి 15 వందల సంవత్సరాలయినందువల్ల "మంద" చెదిరి చెల్లాచెదరయిపోసాగింది. మోసెస్ వద్దన్న పనులు

మహాందకారంగా ఆవరించింది. ఉద్వేగం పెనుగాలిగావించి మనుషుల్ని ఎటుపడితే అటు తోసివేస్తోంది. 'హింసా దౌర్జన్యాలు పరుషవాక్కులు కుంభవృష్టిగా కురుస్తున్నాయి. అశాంతి సముద్రానికి ఉప్పెన వచ్చింది. మతగురువులు నియంతలైపోతున్నారు.

వేళాయెనని, ఈ కల్లోలంమధ్య, ఈశ్వర పుత్రుడు జీసస్ ధర్మసంస్థాపనార్థం సంభవించాడు. నాలుగుసంవత్సరాలు తనను నిరసించినవారిమధ్య తిరిగాడు. ఎరుకగలవారు ఆయనను చూడగానే గుర్తెరిగి నమస్కరించారు. కొందరు తామెరిగిన యే మతగురువుకూ లేని అధికారంతో ఆయన ప్రపంచించిన వాక్కులు విని శిరసావహించారు.

నమ్మడం చేతకాక అజ్ఞానంలో వున్నవారికోసం ఆయన ఎన్నో అద్భుతాలు చేసి దారికి తెచ్చి అప్పుడు మంచిమాట చెప్పాడు. మనవూరివడ్రంగియోసేపుకొడుకు గాదూ, వీడికిన్ని కబుర్లెలా తెలిశాయీ, ఇంతవాడెప్పుడైనాడూ అంటూ హేళన చేస్తూ, నమ్మదలచుకోని వారికోసం ఆయన అద్భుతాలు చెయ్యలేదు. ఎంతటివాడికైనా స్వస్థలంలోనూ, స్వగృహంలోనూ మన్నన ఉండదుగదా అన్నాడు.

చివరకు తనను నమ్మక, ద్వేషించి అపచారం తలపెట్టినవారిద్వారానే ఆయన అందరిలోనూ ఒక్కసారిగా బుద్ధిని స్థాపించాడు. వారి హింసలు శాంతంగా సహించి, వారిపాపకర్మద్వారా పశ్చాత్తాపం పశ్చాత్తాపం ద్వారా బుద్ధి కలగడానికై ఆత్మార్పణ చేసుకొన్నాడు.

శిలువమీద తనువు చాలించిన తరువాత, 'పునరుద్భవించి' తన శిష్యులకు దర్శనమీయబోయినపుడు తోమస్ అనే శిష్యుడు లేడు. తరవాత అతడు ఇది విని నమ్మలేదు. నేను ఆయనను తాకి చూస్తేగాని నమ్మను అన్నాడు. ఎనిమిదవ రోజున జీసస్ తిరిగి దర్శనమిచ్చాడు. తోమస్ ను చేరబిలచి పరీక్షచేసి చూచుకొమన్నాడు. సిలువ మేకులు జీసస్ అరచేతి పొడిచినచిల్లులలో వేళ్ళు దూర్పించి చూచి, అప్పుడు నమ్మాడు తోమస్.

నన్ను చూచి నమ్మినవాడవు నీవు; చూడకుండానే నమ్మినవారు ధన్యులు అన్నాడు జీసస్.

ఆయన నాలుగుసంవత్సరాల ప్రబోధాలకూ ముఖ్యవృత్తం ఇదే. "భగవంతుడు, సర్వ ప్రపంచానికి ప్రభువు ఒక్కడే. నేను సాక్షాత్తూ ఆయన పుత్రుణ్ణి మీరు ఈ వాక్యం విశ్వసించి, గురి ఉంచి తరించండి



చ ర మ రా త్రి

శిలువమీద తనకు అపచారం జరుగుతున్న వేళకూడా, వారు అజ్ఞానంవల్లనే అలా చేస్తున్నారు కాబట్టి క్షంతవ్యులనే జీసస్ అన్నాడు.

తండ్రీ! వారేమిచేస్తున్నారో వారికి తెలియదు. వారిని మన్నించు అని తనతండ్రి భగవంతుని కోరాడు.

* * *

ఈశ్వరపుత్రుడి వాక్యాన్ని నేల నాలుగు చెరగులా వినిపించి స్థాపించబోయిన ఏకాదశ శిష్యులలో ముఖ్యులు పీటర్, పాల్.

పీటర్ జాలరి. విద్యాగంధం లేనివాడు. జీసస్‌ను చూడగానే నమ్మి శిష్యుడైనాడు. పాల్ నమ్మకని గ్రహించి, శిష్యుడయినాడు. జీసస్ అనుయాయులను హింసించాడు. ఒక శిష్యుడిని అంతా రాళ్ళతో కొట్టి చంపుతూ ఉంటే తనూ రాళ్లు వేశాడు.

ఎవరీ ఏసు? ఈయనకీ, దేవునికీ, లోకానికీ సంబంధం ఏమిటి? ఈయన మాట నిజమన్న నమ్మకం ఏమిటి? అన్న ప్రశ్నలను పీటర్ తర్కించలేదు. అతనికి ప్రధానమైన విశ్వాసం ఉంది. బాగా చదువుకొని, గ్రీకు హీబ్రూ సంస్కృతులను వంటబట్టించుకొన్న రోమన్ నాగరికుడు పాల్ ఎదిరించి దారికి వచ్చాడు. ఆతరవాత కూడా క్రైస్తవాలయాలు ఎన్నో స్థాపించాలన్న మహాకార్యం తలపెట్టినందువల్ల ఆయనకు ప్రతిచోటా ఈ ప్రశ్నలు ఎదురయ్యాయి. ఎవరీ క్రీస్తు? భగవంతుడి ప్రతినిధిగా మాట్లాడడానికి అధికారం ఎవరిచ్చారు? ఇచ్చారని దాఖలా ఏమిటి? భవిష్యత్తుగురించి ఈయన ఎలా మాట్లాడగలడు? అన్న ప్రశ్నలు వచ్చాయి. జీసస్ ప్రసంగించిన వాక్యాలకు భిన్న భిన్న నిర్వచనాలు వచ్చాయి. వీటన్నిటికీ సమాధానాలు చెప్పి మరీ ఒప్పించవలసి వచ్చింది. సెయింట్ పాల్ అందుకు సిద్ధపడ్డాడు. క్రైస్తవమతం నిలబడాలంటే ఇది తప్పనిసరి అయింది. చివరకు ఈ ప్రశ్నలకు సమాధానాలు వదికి భాష్యాలు చెప్పేసరికి మహాగ్రంథం అయింది. జీసస్ మాటలు ఆయన నోటివెంట వచ్చినపుడు వినబడినంత తేలిక మాటలు కావని, బుద్ధిగా బతకాలని చెప్పే నీతిమాటలు మాత్రమే కావనీ, క్రమముగా విశదం అయింది. ఈ విధంగా జీసస్ ముఖతః వచ్చిన వాక్యాలకు భాష్యాలు, ప్రతివాదాలకు సమాధానాలు వ్రాయడంతో వాక్యం



అంతిమ యాత్ర

పెద్ద మతమై శాస్త్రమై వర్ధిల్లింది.

ఇది వ్రాసినవాడు పాల్ కాబట్టి ఒకవిధముగా నేటి క్రైస్తవ మతానికి కర్త సెయింట్ పాల్ అనే చెప్పాలని అంటారు.

ఈ విధంగా ప్రధానంగా ఈ యిద్దరి భుజస్కంధాలమీద క్రైస్తవం స్తవనీయమైన మహామతంగా వర్ధిల్లింది. అచంచల విశ్వాసం పునాదిగా గల క్రైస్తవాలయ వ్యవస్థ నిర్మాత పీటర్. అపారమైన తత్వశాస్త్రం నిర్మించినవాడు పాల్.

వాదాలు ఎన్ని జరిగినా, మతాలకు విశ్వాసం అనేది ప్రధానాశయం. నమ్మినవాడికి ఏమీ చెప్పనవసరం లేదు; నమ్మనివాడికి ఏమి చెప్పినా ఉపయోగం లేదు.

అందుకే జీసస్ ఈ భారాన్ని స్వయంగా పీటర్ కు అప్పగించాడంటారు. పీటర్ నిజనామం సైమన్. అతనికి పీటర్ (శిల) అని జీసస్ నామకరణం చేశాడు.

నీవు పీటర్ వి. ఈ మహాశిలపైన నేను చర్చిని నెలకొల్పుతున్నాను... అని శేవతో ఆదేశించాడంటారు.

ఈ ఆశయంలోనే మతం ఉద్దీప్తమైంది. ఆలయాలు నెలకొన్న చాలకాలానికి కాని ఇదంతా నిర్దిష్టమైన గ్రంథంగా రూపొందనే లేదు.

* * *

అపారమైన ప్రాతికూల్యం మధ్య, శత్రుత్వంమధ్య పుట్టిపెరిగిన క్రైస్తవమతం ఈనాడు ప్రపంచంలో అగ్రగణ్యమైన స్థాయికివచ్చి 80 కోట్లమంది (ప్రపంచ జనాభాలో 3వ వంతు)కి ఆధ్యాత్మిక మార్గదర్శిని అయింది. పెరిగి పెద్దదై నిలదొక్కుకునే పర్యంతం రాజుల, చక్రవర్తుల ప్రతిఘటనను తట్టుకొంది. అన్యమతస్థులను ఎదిరించి సంగ్రామంకూడా సాగించింది. ఎందరో మతసాక్షులుగా ప్రాణాలు అర్పించారు. ఈ పరీక్షలన్నిటా దీన్ని నడిపినది ప్రధానంగా విశ్వాసమే. మరోవంక క్రైస్తవమతస్థులలోనే అభిప్రాయభేదాలు, నిర్వచనభేదాలు వచ్చాయి. అవి తీవ్రమైన సమరాలుగా సాగాయి. నాలుగవశతాబ్దంలో కాన్‌స్టాంటైన్ చక్రవర్తి ఈ మతాన్ని ఆదరించాలా కూడదా అని తటపటాయిస్తున్న వేళ ఒక వివాదం జరిగింది. క్రీస్తు, సాక్షాత్తు భగవంతుడి అంశయేనా లేక, ఆ అంశకు ప్రతిమానుడా అని. ఈ వాదానికి కేంద్రం గ్రీకు భాషలోని

Homoousian
Homoiousian

అనే రెండు మాటలలో ఉన్న ఉచ్చారణ భేదం. 00,0i అనే అక్షరాలను పలకడంలో తేడా. ఆనాటినుండి దాదాపు నూరేళ్ల పాటు వారూ వీరూ వాదులాడుకున్నది ఈ ఒక స్వరద్వయ సంధికోసం అని ఇంగ్లీషు చరిత్రకారుడు ఎడ్వర్డ్ గిబ్బన్ ఛలోక్తి విసిరాడు. కాని, ఆ తేడా వెనకగల తాత్పర్యం మీద అసంఖ్యాకులైన వ్యక్తుల భక్తి విశ్వాసాలు ఆధారపడి ఉన్నాయి. తర్జుమా తీవ్రతరమై, శ్రుతిమించి చేతులు కలిసే పర్యంతం వెళ్ళిన మీదట క్రీస్తు భగవదంశయే నని నిర్ధారణచేసి శాంతించారు.

ప్రాక్పశ్చిమాల పరిహద్దువద్ద ఉద్భవించిన క్రీస్తుమతం 13-వ శతాబ్దంనాటికి బహుళంగా వ్యాపించి ఉచ్చదశకు వచ్చింది.

# నా స్వామి

నా సామి యేసుసామి-నాసామి
నాదు బంగారు సామి!
నాకోసమేల వొచ్చావురా-
నాసామి,
కేకేత్తె రాకపొయ్యావా॥
నాసామి॥
సుక్కాగిక్కా క్కల్లేదు-నాకేమి,
నక్కంగ వచ్చేయగల్ను
నీవూరు నాకుదెల్సులే-బాగానే,
వుండు, నేవొత్తూండ॥ నాసామి॥
పట్టువస్త్రాల్లేవు-నాకాడ,
బంగారు, బోళం లేవు.
నక్కాని తాయమున్నదిలే-
నాసామి,
వుండు, నేవొత్తూండ॥ నాసామి॥
యేరోదురాజుసూత్తే-యేమంట?
యేరికి బయము లేదులే.
ఆడష్టా నచ్చినాదులే-నాసామి,
వుండు, నేవొత్తూండ॥ నాసామి॥
సినోడ్ను యేమత్తుంటే-కానీవు,
వాణ్ణెత్తుకోని వుంటే,
ఏమవు మానేశాదులే-నాసామి
వుండు, వరిగెత్తూండ॥ నాసామి॥

*బి. పురుషోత్తం*
దక్షిణాంధ్ర లూథరన్ చర్చి,
రేణిగుంట.

అప్పటికి ఎన్నో కష్టాలు, గండాలు గడచిన ఆ మతానికి సర్వత్రా ఆలయాలు వెలశాయి. పాలకులూ బహుళంగా వచ్చారు. ఆ వేళకే వారి స్వకీయ నిర్వచనాలు బహుముఖంగా విస్తరించడం, వ్యక్తిగత ప్రవర్తన ఎబ్బెట్టుగా తోచే పరిస్థితులు రావడం, అధికార దుర్వినియోగం సంభవించడంతో ప్రజాబాహుళ్యానికి గౌరవం తగ్గే పరిస్థితులు వచ్చాయి. ఆ కాలపు పోపులపై, ఇతర మతాచార్యులపై విమర్శలు పెరిగాయి. బొకాషియో కథలు యీ కోవవే. మతగురువు జరిమానాలు వేసి పాపపరిహారం చేసేపద్ధతులు ప్రబలాయి. ఒకదొంగ ఒక మతగురువు దగ్గరకు వెళ్లి తాను ఒక మతాచార్యుడిని దోచుకొన్నట్లు చెప్పి ఒక లక్ష చెల్లించి పాపనాశనపత్రం పుచ్చుకొన్నాడు. మర్నాడు ఆ మతగురువే పైకం తీసుకొని పొరుగూరు వెళుతుండగా ఆదొంగ అటకాయించి అతని దగ్గర ఉన్న మూటలన్నీ దోచుకున్నాడు. ఇదేం పాపకార్యం అని ఆయన చెప్పేసరికి, నిన్న మీకు లక్ష ఇచ్చి పరిహారపత్రం కొనుక్కున్నది ఇవాళటి దోపిడీకోసమే అని దొంగ బదులు చెప్పాడట.

మతానికి ఈ పరిస్థితులవల్ల, భగవంతుడి ప్రతినిధి అనుకున్న పోపును విమర్శించేవారు పెరిగారు. ఈశ్వరసాన్నిధ్యం చేరడానికి మధ్యవర్తులు అక్కరలేదన్నారు.

ఈ అశాంతిలోనుంచి, 16 వ శతాబ్దంలో ప్రొటెస్టాంటిజం పుట్టింది. ఈ ఉద్యమకర్త మార్టిన్ లూథర్. పోపులకు అధికార ప్రాబల్యం ఉన్న ఆరోజులలో లూథర్ బతికి బయటపడడమే గాక పెద్దగా రాణించడానికి-అప్పటికే క్రైస్తవాలయాలకు పెద్ద మొత్తాలుగా డబ్బు చెల్లించి విసిగి ఉన్న జర్మనీలోని రాజులంతా లూథర్ ను బలపరచడమే ముఖ్యకారణం అని చరిత్రకారులు అంటారు.

లూథర్ ఉద్యమాన్ని అందుకొని ప్రొటెస్టెంట్ మతంలో విశ్వాసాలన్నిటినీ క్రమబద్ధంచేసి సుస్పష్టంచేసి, గ్రంథస్థం చేసినవాడు జాన్ కాల్విన్. ఇన్‌స్టిట్యూట్స్ ఆఫ్ క్రిస్టియన్ రెలిజియన్ అనే పేరుతో ఆయన 104 సంపుటాల పెద్దగ్రంథం వ్రాశాడు. భగవంతుడు సర్వేశ్వరుడనీ, సర్వమూ ఆయన ఇచ్ఛ ప్రకారమే జరుగుతుందనీ, ఆయన సంకల్పిస్తే పాపికి ముక్తి, లేని పాపపు పతనం ప్రాప్తిస్తాయని దానిని నివారించగల మధ్యవర్తులు లేరనీ ఆయన తాత్పర్యం.

ఈ విధంగా జర్మనీలో ఆరంభమైన 'ప్రొటెస్టెంట్' ఉద్యమం క్రమంగా విస్తరిస్తూ జనబాహుళ్యాన్ని ఆకట్టుకొనసాగి, ఇతర ప్రాంతాలలోని రోమన్ కాథలిక్కులమీద ప్రతిఘటి

(61 వ పేజీ చూడుడు)



మొదటిసారి జీతం అందుకుని రూముకు వస్తుంటే ఆలోచనలు అలల్లాగా నాలో రేగాయి. నేను జీవితంలో తొలిసారి సంపాదించిన ఈ మొత్తంలో వాటా పంచుకోడానికి నామీద ఆధారపడినవారు ఎవ్వరూ లేరు. కన్నకడుపు కాకపోయినా అంతకన్న మిన్నగా నన్ను చిన్ననాటినుండి పెంచి పెద్దచేసి, నా ఉద్యోగ వార్త విని సంతోషపడిన "అక్క" కూడా ప్రస్తుతం ఇక్కడలేదు. మరి ఈ డబ్బు ఎవరికివ్వను?

గదికి వచ్చి యూనిఫారం తీసి, ముఖం కడుక్కుని ఈజీచైర్ లో పడుకుని ఒకసారి చదువుటమయినా, అక్కడ పడివున్న పేపరు తీసి చూస్తున్నాను. కాని మనస్సు మనస్సులో లేదు. ఏమి ఆలోచిస్తున్నానో నాకే తెలియదు.

వాతావరణ ప్రభావమో, అంతులేని ఆలోచనల కారణమో, బద్ధకంగా వుంది. టైం ఆరు అయినా షార్ట్‌హాండు కోర్సుకో దానికి వెళ్ళ బుద్ధిపుట లేదు ఆనాడు "ఉద్యోగం చేస్తున్నా ఇంకా ఈ టైపింగ్ షార్ట్‌హాండ్ దేనికి" అని ఒక్కొక్కప్పుడు అనిపిస్తున్నా అలాగే నెట్టుకువస్తున్నా.

బయట తలుపు చప్పుడయింది వెళ్ళి తలుపు తీశాను. ఆశ్చర్యం ఉమ ప్రత్యక్షమయింది

"ఏమండీ అలా చూస్తారు? ఈవేళ టైపుకు రారా ఏం."

"బద్ధకంగా వుందండీ. ఈ రోజు మరి రాలేను. రండి కూర్చోండి" అంటూ కుర్చీ ముందుకు లాగాను ఆమె వచ్చి కూర్చుంది నాతోపాటే షార్ట్‌హాండ్ నేర్చుకుంటోంది టైపుకూడాను ఆ ఇనిస్టిట్యూట్‌లో చేరిన ఈ నెలరోజులలోను కనీసం ఒక్కమారు కూడా ఆమెతో మాట్లాడిన జ్ఞాపకం నాకు లేదు కాని నేడు తలవనితలంపుగా నా రూముకు ఆమె రావడం చూస్తే నాకు మరి ఆశ్చర్యం వేయదూ!

ఆమే ప్రారంభించింది "రేపు మా కాలేజీలో డాన్స్ ప్రోగ్రాం ఒకటి వున్నదండీ కాలేజీ డ్రమెటిక్ అసోసియేషన్ ఫండ్స్ కోసం ఏర్పాటుచేశాం. తప్పక మీరు టికెట్ తీసుకోవడమే కాకుండా, రావాలి" అంది నవ్వుతూ

"ఓ, దానికేమండీ అలాగే" అన్నాను ఆమె అడిగిన తీరుకు ఆశ్చర్యపోతూ అటు పయిన ఆమె నాకు టిక్కెట్ ఇవ్వడం నేను చందా చెల్లించుకోవడం యథాలాపంగా జరిగిపోయాయి

ఆమె వెళ్తూ మరోమారు, "తప్పక రావాలిసుమా" అని హెచ్చరించి మరి వెళ్ళింది కాని నేను ఫంక్షన్‌కు వెళ్ళలేదు కారణం నాకే తెలియదు. అలవాటు ప్రకారం బీచ్‌కి వెళ్ళాను

మరునాడు ఇన్‌స్టిట్యూట్‌లో మామూలుగా కలుసుకున్నాం. ఆమె పలుకరించ

లేదు. పలుకరించే అలవాటు నాకు లేదు. టైం అయిపోయింది. తిన్నగా రూముకు వెళ్ళాను. అక్కడ దగ్గరనుండి వచ్చిన లెటరు టేబిల్ పై వుంటే తీసి మరోకమారు చదువుకున్నాను. ఎందుకో ఆమెకు నేనంటే అంత మమకారం. నా పెళ్ళివిషయం ప్రస్తావించింది. నే నిష్టపడితే తను సంబంధం చూస్తుందట. ఆమె మాటకు ఎదురాడనని ఆమెకు తెలిసినా, ఈ విషయంలో నాకు సంపూర్ణస్వాతంత్ర్యాన్ని ఇస్తున్న అక్కకు నే నేమని జవాబు వ్రాయాలో నాకే అర్థం కాలేదు.

"నమస్తే"

ఇంకెవరన్నారు, ఉష. "ఏమిటండీ ఈ తీరం చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నారు"అంటూ వచ్చి కుర్చీలో కూర్చుంది.

"క్షమించండి. ఆ రోజు మీ కాలేజీకి రాలేకపోయాను. పనేమీ లేకపోయినా రావాలని లేక రాలేదు." అన్నాను అంతకు ముందే అలా అనాలని నిశ్చయించుకున్న నేను.

"ఓ దానికేం లెండి. అలా బీచ్ కి వెళ్దాం వస్తారా.' నే నెలాగూ బయలుదేరుతున్నాను గనుక అభ్యంతరం చెప్పవలసిన పని లేకపోయింది.

రంగురంగుల ఫ్రాకులు తొడుక్కున్న పాపలతో, రకరకాల జంటలతో మెరీనా బీచ్ ఇంద్రధనస్సులాగుంది. ఉషను అనుసరించి నడుస్తున్నాను. వివిధ రకాలైన ఆలోచనలు మదిలో మెదలుతుంటే ఉషను చూచి ఒకమారు నవ్వుకున్నాను. అలా కొంత దూరం నడిచి ఒకచోట కూర్చున్నాం. ఉష సముద్రంవైపు తదేకంగా చూస్తూ కూర్చుంది ఆమె ఈ లోకంలో వున్నట్టు నాకు గోచరించలేదు. ధైర్యంచేసి నిదానించి చూచాను ఆమె వంక.

కనకాంబరంరంగు నైలాన్‌చీర, ముద్దమందారపు వెల్వెట్ జాకెట్, మెడలో సన్నని గొలుసు, చెవులకు రింగులు, కుడిచేతికి రెండు బంగారు గాజాలు, ఎడమ చేతికి చిన్న రిస్ట్‌వాచి. నుదుట నయాపైసంత చుక్కబొట్టు, ఫాలభాగంపై ఆడుకుంటున్న ముంగురులు, పిరుదులవంటే జడ నన్ను పరవశుణ్ణి చేశాయి. ప్రయత్నంలేని పరిచయం, తలంచని మైత్రి ఆమెతో నాకు కలిగినందుకు చాల సంతోషమయింది.

చాలసేపు అలా అక్కడ గడిపాం. ఆమె ఏమేమో ప్రశ్నించింది. తోచినమటుకు సమాధానాలిచ్చాను. నేను తెలుసుకున్నది కొద్దిఅయినా ఆనందం మాత్రం అధికమయింది. ఆమె బి. ఎ. ఫోర్త్ ఇయర చదువుతున్నదట. స్వగ్రామం మా వూరుకు దగ్గర. ఉద్యోగం చేయాలన్న అభిలాష ఎక్కువగా వున్నదట. ఇదీ నేను తెలుసుకొనగలిగినది.

* * *

రూముకు వెళ్ళి పడుకున్నానన్నమాటే గాని నిద్రరావడంలేదు. మనసు పరిపరి విధాల పరుగులెడుతూవుంది. ప్రయత్నం లేకపోయినా కళ్ళముందు ఉష రూపం ప్రత్యక్షమవుతూంది. నాలో ఏ బలహీన శక్తి ప్రవేశించి నన్ను వశపరచుకున్నదో ఏమో నా మనసుపై నా అధికారం ఏమీ పనిచేయడంలేదు. అబ్బ. ఎంత బలహీనుడనయిపోయాను!

కాలం మనకోసం ఆగదుగదూ! తెల్లవారింది. నన్నావరించిన బలహీనత, బద్ధకం ఇంకా నన్ను పూర్తిగా వదలలేదు. జవాను వచ్చి వాడి పనులు ముగించుకుని వెళ్లాడు. కాలకృత్యాలు ముగించుకుని రేడియో ట్యూన్‌చేసి కూర్చున్నాను. "కహా లే చలే హై బతాదే ముసాఫిర్ సితారోంకె ఆగే ఏ కైసా జహా..."అన్న లతా మృదుమధుర గానంలో తన్మయుడనై ఉన్న నేను, ఉష రావడం గమనించలేదు—"ఏమండీ. ఏం చేస్తున్నారు" అని పలుకరించేవరకు.

"ఓ...మీరా. రండి...రండి. ఏంచేస్తూంటానండి. రేడియో నేను అంతే. అంతకన్న బ్రహ్మచారులు చేసేదేముందండీ" అన్నాను నవ్వుతూ.

> ఒక రౌడీని రామయ్య 'గాడిదా' అన్నాడని ఆ రౌడీ ఫిర్యాదు చెయ్యగా కోర్టువారు విచారించి రామయ్యకి జరీమానా వేసేరు. జరీమానా చెల్లిస్తూ రామయ్య జడ్జి నిలా అడిగేడు. "అయితే రౌడీగారిని ఇహానెప్పుడూ 'గాడిదా' అని అనడానికి వీలు లేదన్న మాట." 'అవును. ఎంత మాత్రం వీల్లేదు.' అన్నారు జడ్జీగారు.
>
> "అయితే గాడిదని 'రౌడీ గారూ' అనవచ్చా?"
>
> "దానికి కోర్టువారికేమీ అభ్యంతరము లేదు."
>
> రామయ్య రౌడీ వంక జూచి "శెలవు రౌడీగారూ!" అని వెళ్ళిపోయినాడు. —బాబూరావు

"అలాగా. అయితే పెండ్లిచేసుకోండి. అప్పుడు పిల్లలతో బాగా కాలక్షేపం అవుతుంది" నవ్వింది చిలిపిగా.

"మీరు పిల్లదాకా వస్తున్నారు. పిల్లనిచ్చే పుణ్యాత్ములు ఇంకా కనిపించలేదు" అన్నాను.

"మీకేమండి. ఉద్యోగం, అందం అన్నీ వున్న మీకు పిల్లనివ్వడానికేముంది."

"అయితే నేను అందగాణ్నని మీరు ఒప్పుకున్నట్లేగదూ" అని కొంటెగా నవ్వాను. ఆమె తక్కువ తిన్నదా. కనిపెట్టేసింది.

"అవును. మీ ముఖం చూస్తుంటే కన్ను మూసుకోవాలనిమాత్రం అనిపించదు" అంది.

"రక్షించారు. ఆమాత్రం చాలు, మరి మీ కభ్యంతరం లేదనుకుంటా"అంటూ ఆమె వంక సమాధానంకోసం ఆతృతగా చూచాను. ఆమె పలుకలేదు. ఆతృత హెచ్చింది. "చెప్పు ఉషా. నేను ఒంటరిగాణ్ణి. నాకు ఈ ప్రపంచంలో "నా" అన్నవారెవ్వరూ లేరు, చిన్ననాటినుండి పెంచి పెద్దచేసిన "అక్క" మినహా. ఇంతవరకు మీరంటే ఏ అభిప్రాయమూలేని నేను, ఇపుడు నన్ను మీకు అర్పణచేసుకోందా మనుకుంటున్నాను. ఆ బాధ్యత స్వీకరించడానికి సంసిద్ధురాలవుగదూ. చెప్పు ఉషా చెప్పు."

వెర్రిలా ఆవేగంతో ఏమేమో అంటూంటే ఆమె కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. దగ్గరకు వెళ్ళి "ఉషా"అంటూ ఆమె కండ్లు తుడిచాను. నా వక్షస్థలంపై వాలిపోయింది ఉష.

రేడియోలోనుండి "నైన్‌సే నైన్‌మిలా కె పియా"అన్న పాట వినిపిస్తూవుంది. చర్చి గంటలు మ్రోగాయి. ఆమె తల నిమురుతూ అన్నాను "చూడు ఉషా. ఆ గంటల మ్రోతల సాక్షి. ఈ క్షణంనుండి నేను నీ వాణ్ణి" అలా అంటూవుంటే నా కండ్లు జలపూరితాలయ్యాయి కంఠం పలుకలేదు సరిగా.

ఉష వెళ్ళిపోయింది. మరునాడు మామూలు ప్రకారం బీచ్‌లో కలుసుకుందా మనుకున్నాం. కాని తరువాత ఉష కనిపించలేదు. నా ఆతృత, ఆవేదన ఎలా వ్రాయాలో నాకు అర్థం కావడంలేదు. పదిరోజులనుండి కనిపించకపోవడానికి కారణం నాకు ఎంత ఆలోచించినా అంతుపట్టలేదు.

హాస్టల్ కు వెళ్ళాను. లోనికి వెళ్ళడానికి చాల శ్రమపడవలసి వచ్చింది. జయ కనిపించింది. ఉషనుగురించి అడిగాను. ఉష ఇప్పుడు హాస్టల్‌లో ఉండటం లేదట. ఎక్కడ వుంటున్నదీ కనుక్కున్నాను.

అతి ప్రయాసమీద ఉష ఇంటి జాడ తీయగలిగాను. తలుపు తెరుచుకుని లోనికి

(58 వ పేజీచూడండి)

# తెలుగు వెలుగులు 16



పంచెకట్టుకున్న పసిడిమెరుగు పట్టు పీతాంబరం, ఉజ్జ్వలమైన ఊర్ధ్వపుండ్రాలు, అనుష్ఠాన తత్పరతతో శోభించిన ఆనందచ్ఛాయలు, ఈమూర్తిమత్తు మాటలతో ఆయనను చూడనివారికి ఆయన ఎవరో ఊహకు రాకపోవచ్చు. గదిలోకి రాగానే చుట్టూ కలయజూచి, తన్ను చూడవచ్చినది పిన్నలుగాని పెద్దలుగాని సాదరంగా సంభావించి, యోగక్షేమాలు విచారించి, వచ్చిన వారికి మెత్తని చిఱునవ్వుతో గ్రహించి, ముచ్చటగా ఎత్తుకునే మాటల్లోని సాత్త్విక స్తుతినిచేరింతో, సంగీతగానము గురించో మాట్లాడుతూ, మీరు అడిగేలోయి అర్థోక్తిలో ఉండగానే అన్నమయ్య కీర్తనపాడి, నేటి సామయ్య రచనలో పోద్దరణం వినిపించే చతురప్రజ్ఞమైన స్వాదుకంఠం ఎవరిదంటే, కొరికిన ఒక్క 'క్లూ' పట్టుకొని, ఆయనను చూడనివారుకూడా 'శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిది' అని పజిల్ పూర్తి చేసి సంతోషిస్తారు.

ఆయనది అత్యద్భుతమైన నాగరికత; నిరాడంబరత, వినయ నిర్భరత వాని బాహ్య లక్షణాలు. ఆయనలో ఎంత ప్రసన్నమధురమో, అంత గంభీరం. అతివ్యాప్తి, అవ్యాప్తి తప్పించి ఆయనవద్ద మాట్లాడగల వారు అరుదు. సప్తతి సమీపించినా, ఆయనలో మెఱుపుదీగవంటి చురుకుదనం ఉంది. 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అనే సూత్రం చిత్తగతం, వృత్తగతం చేసుకొని, తాను నమ్మిన రసికతను రాజయోగంగా నడుపుకొంటున్నవాడు ఆయన. కృత్రిమతను పెంచుకొంటున్న కళలను అకృత్రిమమైన జీవితంతో కాడిగట్టి, లాంగదీసి, ఆత్మఫలాలు పండించడమే ఆయన నిత్యవ్యవసాయం.

ఆయనది ప్రధానంగా విమర్శాధికారం గల వ్యక్తిత్వం. బహుభాషలలో పాండితి, సంగీతం, శక్తి, నిపుణత, లోకజ్ఞత, కృష్ణబ్రహ్మతంత్ర యతిరాజ కౌట్యజ్ఞాలకీలు – ఇన్ని ఉన్నా, ఆయన తన చిన్ననాటి కవితా సాధన చాలించుకొనడం కొరతగానే ఉంటుంది మనకు. అలనాటి ఆ ప్రాకృత గాథలను అనన్యసాధ్యంగా తేటగీతులు ఆటవెలదులుగా మలచిన ఆయన ప్రతిభ ఈనాటికీ అనుభవరసికులకు ఆనంద సంధాయకమే. 'మీరు కవిత్వం ఎందుకు చెప్పరు?' అని ఎవరైనా అడిగితే, 'కవిత్వంలో నేను కొత్తగా ఇవ్వగలపదార్థం లేదు' అంటారు వినయం విరజిమ్ముతూ.

విమర్శకుడుగా ఆయన వ్రాసిన 'వేమన', 'నాటకోపన్యాసములు', 'సారస్వతాలోకము', 'సాహిత్య—మఱుజీవనకళ' (కన్నడం) కొంచెము నేనూ ఉన్నాను? దండి అనేవారూ ఉన్నారు. "తత్త్వము తెలిసికొనవలెనను వాకి, తెలిసినవాని నిశ్చయముగా ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి సాధనమై ఇరుప్రక్కలందును మఱుగులేని మంచిపదునుగల చురకత్తివంటి రచనాశక్తి", దానికి మెఱుగిచ్చే సూక్ష్మదృష్టి – వీటితో తెలుగుకు సర్జనశీలమైన విమర్శసాహిత్యం సృష్టించియిచ్చిన కొద్దిమందిలో ఆయన అగ్రేసరుడు.

తెలుగునాడుకు ఆయన చేసిన ఉపకారాలు రెండు. మొదటిది: సాహిత్య ప్రపంచంలో శిష్టాభిరుచి ప్రస్థానాన్ని సాగించడం; రెండవది: తన సాహిత్య వ్యక్తిత్వ సాయుజ్యంగా తనే 'సనాతన సాంఘిక విమర్శకుడు' కావడం. "అంతరంగ శాసన అక్కరగా పండించుటయే అభిరుచి పరమార్థ"మని ఆయన నమ్మకం; జాతి సత్త్వ ప్రబోధం కావలెనని ఆయన సంఘవిమర్శ.

వ్యక్తిత్వ విషయిక గౌరవంకంటే వ్యక్తిత్వ విషయ ఆదరంగల ఆయన ఇంకా ఎక్కువగా వ్రాసినా వ్రాయకపోయినా, సంఘానికీ, సారస్వతానికీ విమర్శకుడుగా నేతృత్వం వహించి నడిపించిన దానినిబట్టి ఆయనను మనం తెలుగునాటి విమర్శకుడనుకోడంకంటే భారతీయ శిష్ట విమర్శకులలో ఒకడని సాధికారంగా చెప్పవచ్చు.

"వ్యదంతి లోకే కావ్యాని
యశాస్య భిదిచోగతిః,
కుకవిత్వ ఫలానీవ
లోకం జయతి భారవిః."

# కథ కాని కథ

## కుఱ్ఱ మేష్టారు

(మొదటి బహుమతి రూ. 10.)

మా యింటికి దగ్గరగా ఒక ఎలిమెంటరీ స్కూలు వున్నది. ఒకప్పుడు నేనా స్కూలులో 4 వ తరగతి చదివేదాన్ని. ఆ రోజులలో మా బడికి క్రొత్తగా ఒక మేష్టారు వచ్చారు. ఆయన సన్నగా, పొట్టిగా కుర్రాడిలా వుండేవాడు. ఆయన వచ్చిన కొద్ది రోజులలో ఆగస్టు 15 వ తేదీ వచ్చింది. ఆ రోజున మామూలుగా మేము మా స్కూలులో జెండా ఎత్తి పాటలుపాడిన తర్వాత మాష్టర్లు మమ్మల్ని పోలీసు మైదానమునకు తీసుకు వెళ్లారు. అక్కడికి కలెక్టరువచ్చి జెండా ఎగురవేస్తారు. తర్వాత మాకు స్వీట్స్ పంచిపెడతారు. అలాగే ఆసంవత్సరము ఉత్సవమైనతర్వాత మేమందరము వరుసగా పోలీసు మైదానమునుండి తిరిగి మా బడికి వస్తున్నాము. మొదట కొందరు మగపిల్లలు, తర్వాత ఆడపిల్లలు, ఆ తర్వాత మరికొందరు మగపిల్లలు, ఇద్దరిద్దరు జట్టుగా నడుస్తున్నాము. మేమువరుసలు తప్పకుండా మాష్టర్లు మా ప్రక్కగా నడుస్తున్నారు. హెడ్మాష్టరుగారు అందరినీ జాగ్రత్తగా ప్రక్కగా నడవమని హెచ్చరిస్తూ ముందుకు వెళ్ళి "కుఱ్ఱవెధవా! వరసలో సరిగా నడవలేవ్" అంటూ ఒకణ్ణి గట్టిగా తలపై మొట్టేరు. అదిచూసి పిల్లలందరం గొల్లుమని నవ్వటం, క్రొత్తమాష్టారు తిరిగి చూడ్డం ఒకేసారి జరిగేయి. ఆ మాష్టరుగారు పాపం చిన్న బుచ్చుకున్నారు. తర్వాత హెడ్మాష్టరుగారు క్షమార్పణ చెప్పుకున్నారు. కాని అప్పటినుండి ఇప్పటివరకు ఆయనకు కుఱ్ఱ మాష్టారు అనేపేరు నిలిచిపోయింది.

ఎస్. సావిత్రి, విశాఖపట్నం.

* * *

## పరాకు తెచ్చిన పరాభవం

(రెండవ బహుమతి రూ. 5)

గడచిన వేసవి సెలవల్లో, మా మామయ్యగారింటికివెళ్లి, సరదాగా నాలుగురోజులు మాబావ రంగనాథం, రాధ వాళ్ళతో కాలక్షేపం చేయవచ్చుగదా అని బయలుదేరాను.

మా మామయ్య ఆ వూరికి కరణం. నేను వెళ్ళేటప్పటికి చాలా హడావిడిలో ఉన్నాడు. నన్ను చూసి కుశలప్రశ్నలు వేశాడు. రంగనాథం, రాధ "ఏం బావా, చాలాకాళ్లకు వచ్చావ్?" అని ఏమేమో అని సరదాగా మాట్లాడారు. మామయ్యమటుకు రాత్రింబగళ్లు ఏమిటో కాగితాలనిండా తెగ వ్రాసేస్తున్నాడు. కాసేపైనా నాతో తీరుబడిగా మాట్లాడలేదు. రంగనాథాన్ని పిల్చి "ఏమిటిసంగతి?" అని అడిగాను. "నాన్నకు జమాబంది ఉంది. ఇంకో రెండురోజులలో ఏలూరు వెళ్లాలి," అన్నాడు.

మర్నాడు, సావిట్లో మామయ్య ఏదో వ్రాసుకుంటూ ఉండగా, మేమంతా కూర్చుని ఏవేవో సినిమాకబుర్లు చెప్పుకుంటున్నాం. నేను "ఇల్లరికం" సినిమాగూర్చి, అందులో నాగేశ్వరరావు, జమునలయాక్షన్ గూర్చి ఉపన్యసించటం మొదలుపెట్టాను. రంగనాథం, రాధ ఉత్సాహంగా వింటున్నారు. మామయ్య జమాబంది లెక్కల లోకంలో ఇబ్బంది పడుతున్నాడు.

ఆమర్నాడు మామయ్య జమాబందికి బయలుదేరి వెళ్లాడు. రెండు మూడురోజుల వరకు రానని చెప్పి వెళ్ళినవాడు, మర్నాటి సాయంత్రానికల్లా చక్కా వచ్చేశాడు.

"ఏం మామయ్యా! అప్పుడేవచ్చేశావేం?" అని అడిగాను.

"ఏం చెప్పమంటావురా, అంతా నవ్వుల పాలైపోయింది. వెధవగోల, మీవల్ల నే..." అంటూ ఒక కాగితాల కట్ట నా ముందుపడేశాడు. ఆ కాగితాలు తిరగేసి చూడగా ఒక పేజీలో ఇలా ఉంది: "జమున డిఫరెంట్ ఏంగిల్స్‌లో చాలాబావుంది. నాగేశ్వరరావు ట్రెమెండస్ గా ఉన్నాడు..." అని ఏదో వ్రాసి ఉంది. "జమాబంది కాగితాల్లో జమున, నాగేశ్వరరావు లేవిటి మామయ్యా?" అని అడిగి అందరం గొల్లున నవ్వేశాం.

"మీరుచేసిన నిర్వాకమేరా బాబూ ఇది. ఆవేళ నేను రాసుకుంటూ ఉంటే మీరు నాదగ్గరచేరి సినిమాకబుర్లు మొదలెట్టారు. పరాకులో ఉండి మీ మాటలువింటూ ఆ మాటలు కొన్ని వీటిలోకి ఎక్కించాను. తరువాత మళ్ళీ చూసుకోనేలేదు. తీరా తాసిల్దారు "ఏమండోయ్ జమునా, నాగేశ్వరరావు అంటూరారాగారు?" అం అడిగే వరకూ నాకు తెలియనేలేదు. ఇంకేముంది, అక్కడ వాళ్లంతా ఇదిచూసి విరగబడినవ్వటం, నేను చిన్నబుచ్చుకుని చక్కారావడం జరిగింది, అని సమాధానం ఇచ్చాడు మామయ్య.

ఎస్. కె. చిరంజీవి, ఏలూరు.

* * *

## "నేనండోయ్ బావగారూ"

(రెండవబహుమతి రూ. 5)

మా వారికి పేకాటఅంటే మహా పిచ్చి. ఎప్పుడైనా క్లబ్బుకువెళితే రాత్రి భోజనం, నిద్ర అసలు జ్ఞాపకమే వుండవు. తెల్లవారుతూవుండగా ఇంటికివస్తారు. ఒకనాడు సాయంత్రం ఆయన అలా క్లబ్బుకివెళ్ళగానే మా తమ్ముడు అనుకోకుండా వూరునుండి వచ్చాడు. మా వారు క్లబ్బుకు వెళ్లేరు కదా రాత్రికి యింటికి వచ్చేవరకు నమ్మకంలేదని, మా తమ్ముడు, నేను భోజనంచేసి, వాడిని మా వారి పందిరిమంచంమీద పండుకోమని నేను ప్రక్కగదిలో పండుకున్నాను. ఆ రోజు అనుకోకుండా మా వారు 12 గంటలకే యింటికివచ్చి, దుస్తులు మార్చుకొని నా కోసం చూశారు. ఆలస్యంగా వచ్చినందుకు నేను అలిగాననుకుని, మామూలు ధోరణిలో మెల్లిగా ప్రక్కనచేరి 'రాణీగారికి కోపం వచ్చినట్లుంది. మరీ అంతకోపమైతే ఎలా?" అంటూ ప్రేమపాశాలు వల్లిస్తూ, దుప్పటి కప్పుకుని అటు ప్రక్కకు తిరిగి పండుకున్న మా తమ్ముణ్ణి లాలిస్తూ తనవైపు తిప్పుకోబోయారు. అంతవరకు గాఢనిద్రలో వున్న మా తమ్ముడు వులిక్కిపడి లేచి వారిని చూసి "నేనండోయ్ బావగారు!!" అని పెద్దగా అరిచాడు.

ఈ సంఘటన తలుచుకుని మా వాళ్ళు యిప్పటికీ వారిని యేడిపిస్తూనే వుంటారు.

పి. సీతాదేవి,

డి. సి. పల్లి (ఆత్మకూరు తా॥)

★



...మెరికా అధ్యక్షుడు ఈనెల 18 వ తేదీన తాజ్‌మహల్ దర్శించారు.
...స అటూఇటూ మిసెస్ బార్బారా ఐసెన్‌హోవర్, ప్రధాని నెహ్రూ.



ఐసెన్‌హోవర్ కుమారుడు కోడలు
న్యూఢిల్లీలో ఏనుగుపై ఎక్కి విహారం చేస్తున్న దృశ్యం

...శాంతి మంత్రం జపిస్తూ అమెరికా ...ప్రతినిధులు శ్రీ ఐసెన్‌హోవర్ ఢిల్లీ వచ్చి ...నాలుగురోజులుండి వెళ్ళారు. అబ్రహాం ...న్, బెంజమిన్ ఫ్రాంక్లిన్ వంటి మహా...ధులు పుట్టినగడ్డనుంచి, బుద్ధుడు, మహా...కు జన్మించిన భారత్ కు శాంతిదూతగా అరుదెంచారు. యుద్ధ నివారణకు అంకిత...న్న నిర్విరామకృషిలో ఈయాత్ర, ఈ ...త్రలో భారత్ మజిలీ-ప్రధానఘట్టాలు.

శ్రీ నెహ్రూ - ఐక్ లు చేసిన సంయుక్త ప్రకటనలో అమెరికా భారత్ ల ప్రధాన విధానాలు, ప్రపంచశాంతి స్థాపన పట్లగల అభిప్రాయాలు వెల్లడిచేసినవి, శాంతికి దోహదం చేసే కృషి ఎటువంటిదైనా పరస్పరం అంగీకారం ఉంటుందని చెప్పుకొన్నారు,

తమ వీడ్కోలు సందేశంలో వెళ్ళలేక భారతదేశం విడిచి వెడుతున్నామన్నారు శ్రీ ఐక్. ప్రపంచశాంతికి భారత్, అమెరి...కాలం కలిసి పాటుపడగలవని విశ్వాసంతో తిరిగి వెడుతున్నామన్నారు ఆయన.

శ్రీ ఐసెన్‌హోవర్ కృషి సఫలమగు గాక! 'శాంతి, స్నేహం, స్వేచ్ఛ' ప్రపంచంలో నెలకొనుగాక! ★

ఢిల్లీలో కొత్తగా కట్టిన అమెరికన్ రాయబార కార్యాలయం ఐసెన్‌హోవర్ దర్శించారు

పాలమ్ విమానాశ్రయంలో 14 వ తేదీన భారత దర్శనం ముగించుకొని వెడుతూ రాష్ట్రపతికి వీడ్కోలు చెబుతున్న అమెరికా అధ్యక్షుడు



# శాంతి
# స్వేచ్ఛ
# స్నేహం



# హరివంశము

మల్లాది శివశర్మ



## వ్రజనివాసపర్వము-2

పూర్వం ఒక్క రోహిణి బిడ్డతోనే వ్రేపల్లె మహోపర్వంగా వుంటూ వచ్చింది. ఇప్పుడు యశోద ఈ బిడ్డనితో గోకులం గోకులం అంతా పర్వాతిశాయిగా వుంది. గోపికలకు ఆ శిశువులను చూస్తే ఆనందం; గోపకులకు ఆ ఇద్దరిని చూస్తే ముద్దు. ఇక యశోదానందగోపుల మాట, రోహిణిమాట చెప్పనే అక్కరలేదు. గోకులంలో ఒక్క మనుష్యులే కాదు, సర్వ స్థావరజంగమాత్మకమైన ప్రపంచమున్నూ, యశోద శిశువు రాకతో ఆనందాన్ని భజిస్తున్నట్లే వుంది. అప్పుడు గోవులు పిదికినన్ని పాలు మరి యెప్పుడు పిదుకలేదు. అప్పుడు పంటలు పండినట్లు మరి యెప్పుడూ పండలేదు. అప్పుడు పచ్చగడ్డి యేపుగా పెరిగినట్లు మరి యెప్పుడు పెరగలేదు. అప్పుడు యమునానది తరంగాలు లేచి హోరంగులు పోయినట్లు మరి యెప్పుడు పోలేదు. యశోద శిశువు రాకతో గోకులం గోకులానికి కొత్త అందం వచ్చింది. ఎవరు చెప్పుకున్నా యశోద కొడుకు అందాన్ని గూర్చే చెప్పుకున్నారు. యశోదకొడుకు అందాన్ని మెచ్చుకున్నారు. ఏదో అద్భుతమైన ప్రకాశం అపరిభాష్యమై మందలను ఏలుతున్నట్లు వుంది. సముద్రాల మధ్య మేఘంలాగా, గోవుల మధ్య యశోద కొడుకు పెరుగుతున్నాడు. దేహాంతరగతుడైన హరిపోల్కని, కృష్ణవర్ణాభిరాముడై మందలో పయోధర ప్రకర్షను ప్రకటిస్తున్నాడు.

పిల్లలకు నామకరణం మొదలైన జాత కర్మలు నడిపించాలన్న భారం ఒక్క దినాన నందగోపుడికి కలిగింది. ఆ రోజునే మధుర నుండి సకల యాదవకుల పురోహితుడూ, మహర్షి, గర్గుడు, గోకులంలో అడుగు పెట్టాడు. ఆయన తాను ఇందుకు వచ్చానని అనలేదు. కాని నందునికిమాత్రం ఎందుకు వచ్చింది అర్థమైంది. చేయెత్తి ఒక్కసారి వసుదేవునికి నందుడు ఆనందంచేత మనసా నమస్కరించాడు. నామకరణాదిక మహోత్సవాలన్నీ చాలా రహస్యంగా జరిగిపోయినాయి. వ్రేపల్లెలో అందరికీ ఇది గుప్తంగా దాచి వుంచవలసిన సంగతి అని తెలిసి పోయింది. కంసుని భయం లేనివాడు ఆ మందలో ఎవరు? అందువల్ల వారికి ఎవరు వేర చెప్పవలసిన అవసరంలేదు. గర్గుడు రోహిణీ పుత్రుడు పెద్దవానికి రాముడని నామకరణం చేశాడు చిన్నవానికి కృష్ణుడని పేరు పెట్టాడు. సంకర్షణ వాసుదేవులు ఇట్లా గోకులంలో రామకృష్ణులై తల్లుల ఒడులలో ఒకరు లేతనవ్వులు, ఒకరు దోర నవ్వులు ఒలకబోశారు.

గోకులంలో గోపాలి అని ఒక గోపిక వుంది. ఆమెకు తల్లిదండ్రులులేరు. ఇల్లు లేదు. వాకిలిలేదు. అందరి ఇళ్లు ఆమె ఇళ్లు. అందరు ఆమె తలిదండ్రులు. అందరు ఆమెను అట్లాగే చూస్తారు. ఆ గోపాలి వయస్సులో వున్న పడుచు. అందంలో దేవకన్యలకు సాటిగా వుంటుంది. ఆమెకు యశోద కొడుకునందు వున్న మమకారం చెప్పరానిది. ఆమె మనస్సు విచిత్రమైంది. పురుషవాసన ఎరుగకపోయినా, ఆ పసివానిని చూడగా గోపాలి హృదయంలో పుత్రవాంఛ జనించింది. అది ఆమె రహస్యము. ఆ రహస్యముతో ఆమె యశోదను బ్రతకనీయదు. పిల్లవానిని ఆమె దగ్గర వుండనీయదు. ఎప్పుడూ తానే ఎత్తుకుంటుంది. ఆడిస్తుంది. తల్లికన్నా ఎక్కువగా అన్ని పనులు చేస్తుంది. నందుడు ఆమెయందు కోపం చేయడు. యశోద నవ్వుతుంది. రోహిణి దాని హృదయాన్ని గ్రహించినట్లు "ఓసేవ్! గోపాలి! నీకుగూడా ఇటువంటి పిల్లవాని కొడుకు పుడతాడులేవే" అంటుంది. గోపాలి పరవశం చెందుతుంది.

గర్గునితో పాటు మధురనుండి వ్రేపల్లెకు ఆయన శ్యాలకుడు శైశిరాయణుడు గూడా వచ్చాడు. ఈ శైశిరాయణుడు, త్రిగర్తాధీశుని కూతురు, వసుదేవుని భార్య, వృకదేవితో యదువుల యిండ్లకు అరణం వచ్చాడు. ఆయన బ్రహ్మచారి. తపస్సంపన్నుడు. ఊర్ధ్వరేత

# ★ హరివంశం ★

న్నాడు. ఆ సంగతి ఆయనకు తెలియదు. ఆయనకు తెలిసినది ఒక్కటే సంగతి. స్త్రీలను కన్నెత్తి చూడరాదని. అటి ఆయనను ఒక్కసారి యదువులు, అంధకులు, భోజులు, వృష్ణులు అయిన వయసు లోని రాకుమారులు అవహేళన చేశారు. విందుసభలో నీవు మందు మది పొమ్మన్నారు. ఆ మాట ఆయనకు అర్థమైంది. ముఖం కోపంతో, కృష్ణవర్ణ జటిలం అయింది. మనస్సు దుఃఖంచేత, దైన్యం చేత దీనమైంది. ఆ మాట ఆయన మనస్సులో నాటుకుపోయింది.

శైశిరాయణుడు కాశను వదిలి ఎప్పుడూ వుండడు. ఆయనతో తీడే లోకంగా వుంటూవుంటాడు. ఇప్పుడు ఆ కాశతో మందకు వచ్చాడు. వచ్చిన అతని మనస్సు గోపాలిని చూచి మారాకు తొడుకుంది. ఆ గోపాలిని ఆ శైశిరాయణుడు చూచిన చూపులలో కోటిమన్మథ ధనస్సుల టంకారాలు చేసాయి. గోపాలి తబ్బిబ్బైంది. దాని గుండెలో ఎప్పుడూ కలగని కొత్తభావం కల్గి, ఇప్పుడు తళుకులాడింది. దాని శరీరం గగుర్పారింది. దాని కళ్ళు వాలిక లయినాయి. అప్పుడు అది చూచిన చూపులు చూపులు కావు. మన్మథుని ములుకులు. అనంతుడైన మదనుడు ఆ ఇద్దరి చూపులలో ఆకారాలు మొలుచుకున్నాడు.

నందగోపుడు ఆ రోజున బ్రాహ్మణులకు మహోసరసమైన భోజనం పెట్టించాడు. సంతోషంతో వారికి గోవులను దానం చేశాడు. బట్టలు పెట్టాడు. గోకులంలో వున్న చుట్టాల నందరిని పిలిచి వారికి విందు చేసాడు. వారికిగూడా బట్టలు పెట్టాడు. గోవులను పూజించాడు. గోవాటాలను అలంకరింపజేశాడు. ఇంత మూర్తి మంతుడైన పిల్లవాణ్ణి యశోద ఇన్నాళ్ళకు కన్నది. యశోద భాగ్యమే భాగ్యం అంటూ పెద్ద ముత్తైదువులయిన గోపికలు యశోదను పొగడారు. గోపవృద్ధులు కృష్ణుని మూర్తిగరిమను అభినుతించారు. రాముని ఆకార విశేషాలను పొగడారు. "నందా! నీ కొడుకు వున్నాడే వాడు సూర్యుడిలాగా వున్నాడయ్యా! వీడు అబ్బడం నీ అదృష్టం. నీవు సుఖంగా వుండు. ఇటువంటి కుఱ్ఱవాడు ఒకడు ఇంటిలో వుంటేచాలు, ఊరు ఊరంతా సిరిసంపదలతో తూగిపోతుంది" అని దీవించారు.

ఆ ఉత్సవం శైశిరాయణునికి నిరుత్సాహంగా వుంది. గోపాలికి నిరుత్సాహంగా వుంది. శైరాయణుని మనస్సు గోపాలిమీదికి తప్ప మరి ఇంకోవైపుకు తిరగడమే లేదు. అది తన్ను చూచి ఏమను కుంటున్నదో అనుకున్నాడు శైశిరాయణుడు. తన్ను చూచి ఏమను కుంటున్నాడో అనుకున్నది గోపాలి. ఆ ఇద్దరికీ అపగలు భారంగా వుంది. యశోద కొడుకుతో గోపాలి ఇవ్వాళ్ళ ఆడుకోలేదు. ఆ పసివాణ్ణి ఎత్తుకోలేదు. గోపయువతులతో ఆడలేదు. పాడలేదు. ఆ ఉత్సవంలో దానిని ఎవరు అసలు పట్టించుకోలేదు. ఆ పట్టించు కున్నవాడూ ఒక్కడే ఒక్కడు. వాడు శైశిరాయణుడు. అది పట్టించుకున్నది ఒక్కడేఒక్కడు. వాడు శైశిరాయణుడు. వారి హృదయాలు ఆ సాయంత్రం అస్తమిస్తున్న సూర్యుడు విరిసిన ఎఱ్ఱని కాంతులకుపోలి రాగరక్తరంజితా లయినాయి. వారి మనస్సులు మన్మథాగమసుధామాధుర్యాలను చూరగొన్నట్లు మదనప్రమోదవివశాలైనాయి. వారు ఒకరిని ఒకరు చూడరు. తమ్ముతామే చూచుకుంటారు. వారు మాట్లాడరు. తమలోతామే మాట్లాడుకుంటారు. వారు నవ్వరు. తమలోతామే నవ్వుకుంటారు. వారి శరీరంలో యుగయుగాల వసంతశోభ అప్పుడు వికసించింది. వారి మనస్సులను, భావాలను వారు పట్టలేకుండా వున్నారు.

నామకరణమహోత్సవం నిర్విఘ్నంగా కొనసాగింది. ఆ సాయంత్రం గర్గునికి శైశిరాయణుడు కన్పించలేదు. యశోదకు గోపాలి కన్పించలేదు. యమునాతట సౌందర్యాన్ని చూడ్డానికి, యమునలో నార్చడానికి శైశిరాయణుడు పోయినాడనుకున్నాడు గర్గుడు. గోపాలి భోజనం చేసినట్లు లేదు. ఏమైందా అనుకున్నారు నంద యశోదలు. ఊరిలో ఎవరి యింటిలోనో వుండివుంటుం దను కున్నారు ఎవరికివారు. గర్గుడు అనుకున్నట్టు శైశిరాయణుడు లేడు. అందరు అనుకున్నట్లు గోపాలి లేదు. గోపాలి ఇప్పుడు రతీదేవి

# పట్టుకోండి పంతుల్ని

అవసరాల రామకృష్ణారావు

'నమస్కారం ప్లీడరుగారూ!'

'నమస్కారం మేష్టారూ! రండి. ఇప్పుడే మా వాడు బజార్లోకెళ్ళాడు. ఏదో మీరు మా యందు దయుంచి ఈ ఏడాదీ ప్రైవేటు చెప్పేరు కాబట్టి ఈ మాత్రం నిశ్చింతగా వున్నాం. వీడో తడవా రిజల్టున రావాలి. కుర్రాణ్ణి పాలిటెక్నిక్‌లో పారేద్దామనుకుంటున్నానండీ తంత్రులమైన మా పాలిటెక్నిక్ అదేలా కనపడతోంది ప్రస్తుతం. మీరేం అలా వున్నారు?'

'ఏమిటో నండీ...బడిలో పంతులుపని చేసేకంటె కందిరీగలతో కాపురం నయం.'

'అదేమిటీ, మీ కిప్పుడు శెలవులేగా!'

'మేము శెలవులకి శెలవు ఇచ్చేదాకా మా అందరికళ్లూ మామీదే వుంటాయి, మేమేదో అనుభవించేస్తున్నామని...తీరా చేస్తే మేము అనుభవించేది మరోకటి...'

'ఏం జరిగిందండీ అసలు. చెప్పండి చెప్తాను.'

'వినండి అయితే.'

* * *

పొద్దుట కాఫీ హోటల్లో మా ఫ్రెండు రామారావు కనపడి—'ఇదా కారణం! బోధపడిందిలే. ఫెయిలైన ఎండకొని ఈ 'మే' నెలలో భళ్లున ఈ కుండపోత ఏమిటనుకున్నాను. ఇంటిదగ్గిర తప్ప కిళ్లీ అయినా వేసుకోని తమరు కాఫీహోటల్కి దయచేయడమే. ఏం, మా కాఫీ నిన్న బాబాను చేద్దామని కేబీతో రాడానికి వాళ్ల బాబుదగ్గిర కెళ్ళిందా?'

'ఆ మరేంలేదు, మా పాలవాడు యివాళ రాలేదులే...'

'అదేమిటి? తెల్లారేసరికల్లా చిక్కని మంచి తోడల్లాంటి పాలతో "పాలవాడు మా వోల పాడు" అన్నారే?'

* * *

మధ్యాహ్నం బజార్లో మా యిల్లు అద్దెకిచ్చినావిడ కనపడి—'చూడుబాబూ సూర్నారాయణా మళ్ళీ చెప్పలేదనకోకు. పది రోజుల్లో మా యిల్లు ఖాళీచేసెయ్యాలమ్మా'

'అదేమిటి మామ్మగారూ హఠాత్ కాకి ఆని నిల్చున్నపాళాన్ని పొమ్మనడానికి చేసు కొకినసుకున్నారా, ఏ కాకినసుకున్నారా? విడిమనుష్యులనీ-విసదగ్గ జాస్తి కాదనీ చెబుతున్నారని వినికిడి, ఇంతలో ఏమొచ్చింది?'

'అలాగేవచ్చింది. ఏం చెయ్యనూ? నమ్ముకున్నవాళ్ళే ఒక్కొక్కప్పుడు గొంతు కోస్తుంటారు నాయనా...తొందరగా సామాన్లు సద్దుకో అమ్మా; మళ్లీ యిబ్బంది పడిపోతావు.'

* * *

సాయంకాలం యింటికొచ్చేస్తూంటే మా చుట్టాలావిడ కనపడి—'నన్నుమాత్రం నమ్ముకోకండి. పంతులుగారూ నేను రాలేను'.

'అదేమిటి అన్నపూర్ణమ్మతల్లీ! మా ఆవిడకి సుస్తీగా వుంది, కాస్త యీ యిబ్బంది దాటించమా అంటే, అలాగే అన్నావు కాదటమ్మా? మేం అడక్కుండానే వండిపెడతానన్నావు కాదు. టమ్మా! మళ్లీ యింతలో మాట మార్చేసి యిప్పటికిప్పుడు నే ఎలా చావనమ్మా?'

'ఏమో బాబుగారు ... చేద్దామనుకున్నా ఉపకారం చెయ్యనిచ్చే రోజులా యివి?'

'అదేమిటమ్మా అలా మాటాడితే ఎలాగ? తెలిసి నీకు నేనే అపకారమూ చెయ్యలేదు గద.'

'ఏంచేస్తే ఏం లెద్దురూ...ఏమయితేనేం బాతల్ల గాదు. ఇహ నన్నొట్టే కదపకండి, శెలవు.'

* * *

పిల్లందరికీ బాతో ఇంత హాఠాత్తుగా అకారణక్రుత్యం ఎందుకు చేర్పడిందో నాకెంత ఆలోచించినా బోధపడలేదు. సరే యింటికివెళ్లి మా ఆవిడతో నాలుగు సంగతులూ మాటాడితే సంగతి తేలకపోతుందా అని గబగబా యింటికి నడిచాను. ఆ ఒప్పుల కుప్ప బదులు వీధిగుమ్మానికి వేసిన తాళం కప్పవెంకాంచాని నాబాధ ఏమని చెప్పను? పక్కింటి కుర్రాడు తాళంచెవి, చీటీ తెచ్చి యిచ్చాడు. ఆ ఉత్తరంలో సంగతు లేమిటంటే:

'నిన్న మీ హైస్కూలు రిజల్టు కట్టేరుట కదా, నాకూ తెలీదు. పొద్దుట మీరూ వెళ్లక పాలవాడు వచ్చేడు. వాళ్లబ్బాయి ఫోర్తుఫారం ఫేలయ్యాడుట. 'మేం పాలల్లో నీళ్లుకలిపి బతుకుతాం, మేష్టర్లు పరీక్షల్లో మార్కులు కలిపి బతుకుతారనుకున్నాం. అయినా కులవృత్తిని ఓ వొంటికాయసేసి ఎంతో ఆశపడి గుమ్మపాలు దిమ్మరించాం. ఏటికేడాదీ పాలన్నీ ఊసబట్టి, మేష్టరుగారు చేసిన ఉపకారం యిదా? ఈ రోజునుంచి మేం పాలు పొయ్యలేం తల్లీ' అన్నాడు. మరో గడికి మన యింటావిడ వచ్చి వాళ్ళమ్మాయి ఫిఫ్తుఫారం రెండో ఏడాది కూడా తప్పిందిటా—యీమాత్రం ఉపకారం చేతనయ్యిండీ చెయ్యలేక మొహా మొహాలు చూసుకున్నారూ...... త్వరగా దయచెయ్యండని చల్లగా చెప్పింది. ఇంకో గంటకి అన్నపూర్ణమ్మగారు వచ్చి వాళ్ల మరిది పరీక్షపోయిందిటా, సాటి బంధువులం, మళ్ళీ యీమాత్రం మాటసాయమేనా లేదని ఏమీ చేయించలేకపోయానని నన్నుకూడా తిట్టి వెళ్ళింది.

సరే ఇవన్నీ ఒకెత్తు. మొగుడిప్రతాపం యింతలా ఉంటే భార్యకెన్ని కష్టాలో నేను చెప్పక్కర్లేదు. అన్నీ భరిస్తాను. కాని తన్ను మాలిన ధర్మమా? మీరేవో పెద్ద ఊడబొడిచేస్తారని మా పెద్దక్కయ్య మా సుబ్బిగాణ్ణి యిక్కడ అట్టేపెట్టింది. వాడు అల్లరి వెధవే; తెలివైనవాడనను. ఒకటి రెండు మార్కులు తక్కువొచ్చాయే అనుకోండి... అందరూ బుద్ధిమంతులే అయితే ఈ మేష్టర్లెందుకూ, మేత దండుక్కా తప్ప? పరీక్ష పోయిందని వాడివాళ అన్నమేనా తినలేదు.

---

ఒక క్లయింటు తన కేసు ఒక ప్లీడరుకి అప్పచెప్పి తీర్పు రాగానే టెలిగ్రాండ్వారా తనకి తెలియజెయ్యమని తన గ్రామానికి వెళ్లిపోయినాడు. తీర్పు ఈయన పక్షంగానే అయింది. ప్లీడరుగారు "ధర్మమే గెలిచింది" అని తంతి పంపించేరు. దానికి జవాబుగా "వెంటనే అపీలు చెయ్యండి" అని తంతిపంపాడు క్లయింటు. —బాబూరావు.

---

ఒకటే ఏడుపు. బియ్యాడీ ప్యాసయ్యారు, మేష్టరీ వెలిగిస్తున్నారు... అమాత్రం మంచీ చెడ్డా కనిపెట్టకపోతే యింకెందుకండీ మీరు? నేను రేపొద్దుట మా పెద్దక్కయ్య మొహం ఎలా చూడను? ఇంతచేసి మీరు మాత్రం నాకు మొహమెలా చూపించగలరూ? అసలే పెద్ద గాలేస్తే ఎగిరిపోయేలా ఉన్నానా, దీంతో నామనసు మరీ వికలమై పోయిందండీ. మూణ్ణెల్లలోగా యీ అదటు తగ్గుతుం దనుకోను. నాన్నగారింటికి తుని వెళుతున్నాను.'

'విన్నారా ప్లీడరుగారూ, ఇదీ వరస. పది అయిదు లెంత అంటే పక్కవాణ్ణి గోకకుండా చెప్పలేని మా సుబ్బిగాణ్ణి ఫిఫ్త్‌ఫారంలోకెలా ప్యాసుచెయ్యను? అదిగాక ప్యాసు చెయ్యడానికి నేనెవణ్ణి? ఒక్క సబ్జెక్టు నేను చెబితే, ఆరు సబ్జెక్టులు వాడు పేసవ్వాలి. ఆరూ కలిపి గ్రాండ్ టోటల్ అరవై దాటనివాణ్ణి నేనేం ఒడ్డెక్కించను? వీడివిషయమిలా ఉంటే ఆ మిగిలిన విద్యార్థులు ఎవరో నే ఎరగను. చెయ్యని నేరానికి ఇంత శిక్షా? అయినా ఏం పరీక్షలు పోనిద్దురూ. పేపర్లు ఇంటికి వచ్చాయని తెలిసిందగ్గర్నుంచీ ఇల్లు వింశిపోతుంది గదా, మా వాడికి మీ పేపర్లో నే కొంచెం డౌట్‌గా ఉందనుకుంటూ అలా ప్రతీ టీచరు దగ్గరకీ వెడుతూ...ఏం పిల్లలు, ఏం తండ్రులు! పరీక్ష ప్యాసయితే 'మా అబ్బాయి ఎంత బుద్ధిమంతుడో' అనుకుంటారు. పరీక్ష ఫేలయితే 'ఆ చెప్పినవాడు ఎంత చవటో' అనుకుంటారు. పంతుల గాథలు ఎందరు కవులు వంతులు వేసుకుని రాస్తే పూర్తవుతాయి!...ఇంచుమించు మే ఆఖరి వారంలో మా హైస్కూళ్ళ పరీక్షా ఫలితాలు ప్రకటించబడతాయి లెండి. కొంత త్వరగా వస్తే స్కూలు ఫైనలు రిజల్ట్సు ఆ ప్రాంతాల్లోనే వస్తాయి. దీన్ని బట్టి నేనొకటి చెబుతాను. మే ఒకటో తారీకున కార్మికులంతా కలిసి 'ఈ నాడే 'మే' డే. మే డే. నేడే మా డే' అనుకున్నామనినా, మే ముప్ఫై ఒకటో తారీకున బడి పంతుళ్ళంతా కలిసి 'ఈనాడే మా మోహాలు వీడే, మా మొహాలు మాడే డే. మా పొట్టలు కరకరలాడే మా కన్ను గరగరలాడే నా.ఆఖరి డే 'మే ఆఖరి డే నేడే' అనుకోవచ్చు.'

'బలేగా చెప్పేగు మాష్టారూ, అయినా మీ కింకా అనుభవం చాలదనే అంటాను. అయిదేళ్ళ కిందట మా బావమరిది కొత్త నగరంలో ఒక యేడాది పనిచేశాడు, విద్యార్థికి శోపలు వచ్చేటట్లు చెప్పే 'సోమలు' టీచరుగా. ఆ హైస్కూలు టీచర్లందరూ ఒక యేడాది దాటేక, ఆ నగరపు చాయలకు వెళ్ళ లేవనుకోండి. అదెందుకో చెబుతా. పరే ఆ యేడు స్కూలు ఫైనలు పబ్లిక్ పచ్చీసు

"కుటుంబము"          చిత్రకారుడు : ఎస్. వి. రామారావు.

భారత ప్రభుత్వము ఇచ్చే రిసెర్చ్ ఎండ్ కల్చరల్ స్కాలర్‌షిప్‌లలో చిత్రకళావిభాగానికి చిత్రాలు పంపిన భారతీయ చిత్రకారులందరిలో వీరు ప్రథములుగా ప్రభుత్వము నియమించిన ప్రఖ్యాత చిత్రకారుల, విమర్శకుల కమిటీచే ఎన్నిక చేయబడినారు. వీరు ఢిల్లీకి ఎన్నికకై పంపిన చిత్రాలలో ఇదొకటి.

పాళీలో యిరవై ఆరు పావులు పందెం కడితే కనీసం ఒక్కటైనా పండలేదు. సంపూర్ణతాత మెచ్చిన ఖ్యాతి ఆస్కూలుకే దక్కింది.

ఆ ఊరిలోని పనిలేని రౌడీలు 'అందరూ ఫేలయితే నెలకోసారి సంచులు నింపుకునీయ్యీ, పంతులయ్యలు ఏం చేస్తున్నట్లూ?' అనిపించి వారిని సంస్కరించ దలుచుకున్నారు. పల్లీగ్గా ఏమైనా అంటే లా ఒప్పదుగదా. వాళ్ళ కుశాగ్రబుద్ధి చూడండి. దేవుడి పెళ్ళికని ఊరేగింపులో సానిమేళం పెట్టించారు. ఆ వారకాంతలూ ఆ వారా ఈ వారా గెంతుతూ పంతుళ్ళ వీధికి చేరుకున్నారు. "చేదు మాత్రల"లాంటి గుంట వెనకలలో కాలక్షేపం చేస్తున్న ఆ అయ్యవార్లకి కనీసం కంటితోనయినా 'ఈ చక్కరకేళీల్ని చూసుకుందా'మనిపించి ఆ సమాజంలో వీళ్లూ చేరపడ్డారు. బూడిద గుమ్మడి కాయల్లాంటి జబ్బలుగల ఆ రౌడీల కండబలం పదేపదే రుచిచూసి, నీళ్లు పోసిన హాట్ వాటర్ బేగ్ లాంటి శరీరాలుగల ఈ పంతుళ్లు కంటి జలం పదే పదే వరిపించారు. కోర్టు కెక్కితే దొమ్మీ కేసని పోన్నామ్మరట, బాగుందా?'

'బా-గా-నే ఉంది, ఉండండి మీ అబ్బాయి పాసు ఏమిటో అంటూ వస్తున్నాడు...తొందర పనుంది, నే వెడతాను.'

'నాన్నా...నాన్నా...'.

'ఆదేమిట్రా, ఆ ఏడుపేమిటి? చెప్పమ్మా, నాన్నా, చెప్పు.'

'ఇవాళ మా ఎస్సెస్సెల్సీ రిజల్ట్సు వచ్చాయి, నా పరీక్ష పోయింది నాన్నా... నాన్నా!...'

'అయ్యో నాయనా సరిగ్గా నెంబరు చూశావా...పోన్లే ఏడవకు కష్టపడి చదివావు, రాశావు. అంతకన్న నువ్వేం చేస్తావు? అయినా స్కూల్లోనే కాక యింటిదగ్గర కూడా చదివించాను. ఆ ప్రైవేటు మేష్టరు నీ గొంతు కోశాడు. నెలకి పదిహేనురూపాయిలూ బిళ్ళ కుడుముల్లా ముక్కుగుద్ది పుచ్చుకోనేవాడే... కొత్త ఏ పేపరు ఎక్కడి కెళ్ళిందో కనుక్కుని—వాలుకుర్చీ వాకబు చేసి...కష్టమేమిటో సుఖమేమిటో కనుక్కునేపాటి మర్యాదయినా లేదూ? దొంగముండాకొడుకు....తెగతిని...తిన్న యింటికే వాసాలు లెక్కపెడతా డనుకోలేదు. వాడు గుర్లోనూ యీడిపించక ఊరుకుంటానా? ఏదీ? పట్టుకోండి పంతుల్ని.'

'మా మాష్టారు యిందాకట్నుంచే పరిగెడుతున్నారు నాన్నా.' ★

# మాంగల్య మహిమ

**టి. ఎస్. భార్గవీ టాగోర్**

"నాకు మాంగల్యంలో ఏమీ నమ్మకం లేదు లక్ష్మీ" అంది హేమలత. తన్ను అప్సరస్త్రీలా అలంకరించుకొని, సీతాకోకచిలుకలా క్లబ్బులకి, సినిమాలకి తిరిగే హేమలత, మరొక ఏడాదిలో డాక్టరు పట్టా పుచ్చుకోబోయే పాతికేళ్ళ నవీనయువతి హేమలత అలా అనడంలో నాకేమీ ఆశ్చర్యం అనిపించలేదు.

"ప్రేమతో బంధింపబడిన యువతీ యువకులలో కొందరికి చూపింపవలసిన సాక్ష్యంమాత్రమే మాంగల్యం. అదిలేనిస్త్రీ తన భర్తను ప్రేమించలేదా?..." ఇలా ఏమేమో చెప్పుకుపోతోంది హేమలత. "ఏమంటావు" అని గట్టిగా అడిగేసరికి ఈ లోకంలో పడ్డాను.

"హేమా! మాంగల్యంయొక్క పవిత్రత నీకు తెలీదు. దాన్నిగురించి నిజంగా జరిగిన ఒక సంఘటన చెప్తాను వింటావా?" అన్నాను.

హేమ వాచ్ కేసి చూస్తుంది "ఇంకా అరగంట టైముంది. ఈరోజు క్లబ్బులో దీన్నిగురించే చర్చించబోతున్నాం. నీవు చెప్పేవిషయం నాకేమైనా ఉపయోగపడుతుందేమో చెప్పు" అంది.

నేను చెప్పడం మొదలెట్టాను. "అది ఒక చిన్న గ్రామం. దానిపేరు డొక్క. అది నా స్వగ్రామం. ఆ గ్రామంలో ఓ మూడొందల కుటుంబాలుంటాయేమో. మా యింటికి కొంత దూరంలో ఒక పెద్ద వీధిగన్నేరు చెట్టుండేది. దానికింద ఒక చిన్న ఇంటిలోనుండి పొద్దుట ఎనిమిదిగంటలనుండి "టక్కు— టక్కు" మని చప్పుడు వినిపిస్తూ ఉండేది. ఆ గుడిసెలో మా ఊరికంసాలి బంగారయ్య, అతనిభార్య గంగమ్మ, వారి ఒక్కగానొక్క కొడుకు మాణిక్యం ఉండేవారు.

మా ఊరికంతా బంగారయ్య ఒక్కడే కంసాలి. అందువలన అందరూ అతనిదగ్గరే నగలు చేయించేవారు. దానికి రెండు ప్రబలమైన కారణాలుండేవి. ఒకటి—బంగారయ్య మోసము చెయ్యడు. మరొకటి – అతనిదగ్గర చేయించుకున్న మంగళసూత్రంయొక్క బలం గొప్పదని, ఆ మాంగల్యం ధరించినస్త్రీ దీర్ఘకాలం సుమంగళిగా ఉంటుందని ప్రతీతి. ఏ కారణంవల్లనైతేనేం బంగారయ్య కెప్పుడూ చేతినిండా పని ఉండేది.

బంగారయ్య కొడుకు మాణిక్యాన్ని ముద్దుగా "ముత్తూ" అని పిలిచేవాడు. కాని వాడు మాణిక్యమూ కాలేదు, ముత్యమూ కాలేదు. చెడుగుణాలన్నీ కరగించి పోసిన విగ్రహంగా తయారయ్యాడు. ఈ కొడుకును తలచుకొని కుమిలిపోయే వారు బంగారయ్య దంపతులు. అంత మంచి పుణ్యదంపతుల కడుపులో ఇలాంటివా డెలా పుట్టాడా అని ఆశ్చర్యపోయేవారు ఊరివాళ్ళందరు. మాణిక్యాన్ని మంచి దోవను తీసుకురావాలని అందరూ ఎంతో ప్రయత్నించారు, కాని లాభం లేకపోయింది.

ఒకనాడు రాత్రి ఒంటిగంటకు తాగి వచ్చిన మాణిక్యాన్ని చూచి బంగారయ్య కోపం రెచ్చిపోయింది. నోటికొచ్చినట్లుగా తిట్టాడు. అంతే మరునాటిరోజు ఉదయానికల్లా సెట్టిగారికని చేసిపెట్టిన రెండు బంగారు గాజులతో మాయమయ్యాడు మాణిక్యం. గంగమ్మ శోకానికి మితిలేకుండా పోయింది. బంగారయ్య కూడా చివరికాలంలో కొడుకు దగ్గరలేకుండా పోయాడే అని విచారించినా గంగమ్మలాగా బైటపడలేదు. తన భార్య గాజుల్ని సెట్టిగారికిచ్చివేశాడు.

మూడు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు హఠాత్తుగా ఎక్కడనుండో ఊడిపడ్డాడు మాణిక్యం. కాని మూడు సంవత్సరాల క్రితం వెళ్ళిపోయిన మాణిక్యానికీ ఈ మాణిక్యానికి ఎంతో తేడా ఉంది. పిలక తీయించేసి క్రాఫు పెంచాడు. పంచె బదులుగా పైజామా, చేతిలో సిగరెట్టుతో ప్రత్యక్షమయిన మాణిక్యాన్ని చూసి బంగారయ్య అసహ్యించుకొన్నా, పైకి ఏమీ అనలేదు. అంటే మళ్ళీ ఎక్కడ పారిపోతాడో అన్న భయంచేత. ఏదో థర్డుఫారం వరకు చదువుకున్నాడుగదా ఏదైనా ఉద్యోగం చేస్తావా అని కదిపాడు. మాణిక్యం మౌనం వహించడంచేత మళ్ళీ ఆ విషయాన్ని కదపలేదు. రోజూ పక్కనున్న పట్నానికెళ్ళడం సినిమాలు చూడ్డం అలవాటు అయింది. గంగమ్మను వేధించి డబ్బులు గుంజేవాడు. మళ్ళీ ఎక్కడ పారిపోతాడోనన్న భయంచేత భర్తక్కూడా తెలియకుండా డబ్బు లిస్తూవచ్చింది గంగమ్మ.

ఒకనాడు గంగమ్మ భర్తతో "ఏమండీ, మీ రింతమందికి మాంగల్యాలుచేసి వారి జీవితాలు నిలబెడుతున్నారే మన అబ్బాయికి ఒక పెళ్ళంటూచేస్తే బాగుపడతాడేమో ఒక మంగళసూత్రం తయారుచేయండి" అంది. అలాగే అని ఒక మంగళసూత్రం ఎంతో శ్రద్ధతో, ఉత్సాహంతో తయారుచేశాడు. ఒకనాడు పెళ్ళివిషయం కొడుకుదగ్గర కదిపాడు. "మాణిక్యం! నీవు పెళ్ళిచేసుకొని కాపురం చేస్తుంటే చూడాలని ఉందిరా. ఏదో మేమూ ముసలివాళ్ళయ్యాము. నీ ముద్దూ ముచ్చటా చూడాలని ఉందిరా" అన్నాడు బంగారయ్య. గంగమ్మ ఆశగా కొడుకువంక చూసింది.

దీనికి ససేమిరా ఒప్పుకోనన్నాడు మాణిక్యం. కారణం ప్రక్కగ్రామంలోని వాసంతి అనే వేశ్యయొక్క స్నేహం. పెళ్ళి చేసుకుంటే తను ఇప్పుడు గడిపే "జాలీ లైఫ్" కు ఆటంకం కలుగుతుందని భయపడ్డాడు. "నీకోసం ఎంతో కష్టపడి మాంగల్యం కూడా తయారు చేశారురా మీ నాన్న. మా ఆశలు వమ్ము చేయకురా," అంది గంగమ్మ. గంగమ్మ మాటల్లో మాంగల్యం తయారుచేశారనేది మాత్రం స్పష్టంగా వినిపించింది. పెళ్ళి చేసుకున్నా చేసుకోకపోయినా ఆ మాంగల్యం నాకోసం తయారుచేసింది. దాన్ని తీసుకోవడంలో తప్పులేదని ఆ రాత్రి దాన్ని తస్కరించి వాసంతిదగ్గరకు పరుగెత్తాడు.

"వాసంతీ, వాసంతీ"— అని పిలిచాడు. మాణిక్యం గొంతు గుర్తించింది వాసంతి. "నిన్ననేగా వచ్చావు మళ్ళీ వచ్చావెందుకు" అంది తలుపు తీయకుండానే.

"నిన్నటిలాగ వట్టిచేతుల్తో రాలేదు. నీకో బహుమతి కూడా తెచ్చాను."

తలుపు తీసింది వాసంతి. చేతిలోని మాంగల్యాన్ని వాసంతి ముందుగా చాచాడు మాణిక్యం. వాసంతి నోట మాట రాలేదు. 'ఏం వాసంతీ, అలా చూస్తున్నావు" అన్నాడు.

"ఇది ఎవరి మెడలోది?" కటువుగా ప్రశ్నించింది వాసంతి. మాణిక్యం గట్టిగా నవ్వాడు." ఇది దొంగసొమ్మనుకున్నావా? కాదు మా నాన్న నా పెళ్ళికోసం తయారు చేసింది. ఇది నాదే," అన్నాడు.

"ఆ! మీ నాన్న చేసిందా? అయితే నీవు – నీవు బంగారయ్య కొడుకువా?" అవును అన్నాడు మాణిక్యం.

"ఆ, నీవు బంగారయ్యకొడుకువేనా. ఇది వారుచేసిన మాంగల్యమేనా? దీన్ని చూడగానే అనుకున్నాను. ఆ పుణ్యాత్ముడు చేసిన మాంగల్యానికి మాత్రమే యింత అందము, ప్రకాశము ఉంటుంది. ఆ ఉత్తముని కొడుకువా నీవు? నాకు యింతవరకూ తెలియలేదే? మాణిక్యం ఈ మాంగల్యంయొక్క పవిత్రత నీకు తెలుసా" ఈ ఆభరణము ఎంత మహిమగలదో తెలుసా? దీనితో తులతూగే శక్తి మరి దేనికీ లేదు స్త్రీలకు దీనికంటె ముఖ్యమైన దికేదీలేదు. ఆ పుణ్యాత్ముడు చేసిన మాంగల్యంయొక్క మహిమవల్ల ఎంతమంది సుఖంగా కాపురాలు చేసుకొంటున్నారో తెలుసా? నేనూ అలాగే ఉండాలనుకున్నాను, కాని నాకు ఆ అదృష్టములేక యిలా మారిపోయాను. అటువంటి ఉత్తముని కొడుకుకు మాంగల్యంయొక్క మహిమ తెలియలేదే? ఛీ, వెంటనే వెళ్ళి మీ నాన్నగారి ఆశ నెరవేర్చు. ఇంకెప్పుడూ యిక్కడకు రాకు" అని ధబాలున తలుపు మూసేసింది.

నిశ్చేష్టు డయ్యాడు మాణిక్యం. ఒక వేశ్యకు మాంగల్యాన్నిగురించి యింత తెలుసా అని ఆశ్చర్యపోయాడు.

'అయితే నేను చేసింది తప్పా?' మాణిక్యం మనస్సులో పెద్దతుఫాను వీచింది. గబగబా యింటికొచ్చి తండ్రి కాళ్ళమీద పడ్డాడు..

మరునటి నెలలో మాణిక్యం పెళ్ళి వైభవంగా జరిగింది. హేమా! ఇప్పటికీ ఆ గుడిసెలోనుండి టక్కు టక్కుమని చప్పుడు వినిపిస్తూ ఉంటుంది కాని ఆచప్పుడు ఒకరు చేసేది కాదు. బంగారయ్య, మాణిక్యం యిద్దరూ కలిసి చేసేదప్పుడు" హేమ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

ఇంతలో మా అమ్మ "భార్గవీ" అని పిలిస్తే చేతిలోని పుస్తకాన్ని మూసి మాంగల్యంకథనుగురించి ఆలోచిస్తూ లోపలికెళ్ళాను. ★

(ఒక తమిళకథ ఆధారంగా)



(గతవారం తరువాయి)

కమ: ఎందుకు చిన్నాన్నా!

గోవిం: (నవ్వుతూ-పురుషోత్తం-కమలను చూపిస్తూ) మీ పెళ్ళికి సుముహూర్తం స్థిరపర్చడానికమ్మా!

కమ: (సిగ్గుతో తల వంచుకుంటుంది)

పురు: } (ఒకరి ముఖం ఒకరు చూసు
ప్రభా: } కుంటూ-చిరునవ్వులు చిందిస్తారు)

కమ: దయచేస్తారా భోజనాలకు (వెళ్లిపోతుంది)

ప్రభా: వదినగారూ! పసందుగాని మరి లడ్డూ లేమైనా చేయించారా?

కమ: మరిది గారి భోజన మేమిటి! లడ్డూలు లేకపోవడ మేమిటి! మైసూరుపాకు కూడాను! (నవ్వుతూ లోపలకు వెళ్తుంది)

పురు: అలాగయితే పదరా ప్రభా!

ప్రభా: సహావ్వా! సహావ్వా! సంసార మంటే ఇలా వుండాలి. భగవంతుడా! అందరికీ ఇలాంటి వదినను ప్రసాదించు. నీకు పుణ్యముంటుంది. (అందరూ చిరునవ్వులతో వెళతారు)

## 4వ రంగం

[స్థలం: రాంపురం. సమయం: ఉదయం 10 గం॥ జగ్గయ్య ఇంటి దృశ్యం. ఒక డెస్కు ముందు గుమాస్తా కూర్చొని లెక్క వ్రాస్తుంటాడు. ఒక కుర్చీ, టేబిల్ దానిలో ఖాతా పుస్తకాలూ వుంటాయి... తెరలో గుఱ్ఱపు డెక్కల చప్పుడు జగ్గయ్య లోపలకు వస్తాడు. భుజానవున్న రైఫిల్ను తీసి రంగడివేపు విసురుగా పారేస్తాడు రంగడు క్రిందపడకుండా అందుకొని టేబిల్ పై పెట్టి భుజానవున్న తుపాకీగుళ్ల బెల్టు తీస్తాడు. జగ్గయ్య కుర్చీలో కూర్చుంటాడు సిగరెట్టు ముట్టిస్తాడు]

జగ్గ: (సిగరెట్టు పీల్చి పొగవదుల్తూ) ఊ...ప్రకాశం! ఏం చేస్తున్నావు?

ప్రకా: నిన్నటి జమా ఖర్చులు చూస్తున్నానండీ.

జగ్గ: అఁ! జాగ్రత్త! ఒక పయిసైన కూడా పొరపాటు రాకూడదు.

ప్రకా: (తలెత్తకుండానే) చిత్తం! అలాగేనండీ!

జగ్గ: ఆ యాభై యకరాల భూమి తగాదా ఏమయింది!

ప్రకా: ఫైసలాఅయింది. గెలుపు మనదేనండి. పాపం రైతు అందరు పిల్లా జల్లా భోరున ఏడుస్తున్నారు. వాళ్లను చూస్తూవుంటే గుండె తరుక్కుపోయింది.

జగ్గ: చాలే వూర్కోవోయ్! వాళ్లతో పాటు నీవూ ఏడ్వలేకపోయావ? అవును గాని ప్రకాశం! గోపాల్ రెడ్డిగారి కూతుర్ని మన వూరికే ఇచ్చారంటగా?

ప్రకా: అవును చాలా చక్కని అమ్మాయండీ! ఆమె రావడంవల్ల మన గ్రామానికే [illegible] [illegible] [illegible]. మరి అదీగా




...కందరూ ఆమెను ఆదర్శంగా చూపించి పిల్లలకు మంచి బుద్ధులు చెబుతున్నారు.

జగ్గ: అవును. నీవుకూడా వెళ్ళి అప్పుడప్పుడు నేర్చుకోడానికి......గిట్టంది పిల్ల! ఇప్పుడెక్కడి కెళ్ళుంగో చూస్తాను. పంతులూ! నీవు నాకొక సహాయం చేయాలి.

ప్రకా: చిత్తం చెప్పండి.

జగ్గ: ఆకమల నాది కావాలి, నేను వెంబడిస్తున్నానన్న సంగతి చీమకైనా తెలియకూడదు. అది నా పని పూర్తయ్యేవరకూ నీవు నా కుడి భుజంగా వుండాలి.

ప్రకా: జగ్గయ్యగారూ! మీరు గ్రామ పెద్దలు. పెత్తందార్లు. తెలిసినవారు. మీరే ఇలా తప్పుడు దారులు నడుస్తే ఎలా చెప్పండి?

జగ్గ: ఆడనయ్యా నన్ను అవమానించడం తప్పుకాదా?...నీకేం తెలుసు

ప్రకా: మీరు కోప్పడకండి దొరగారు. ఎంతైనా పరస్త్రీ తల్లిలాంటిదన్నారు పెద్దలు.

జగ్గ: ప్రకాశం! ఆ నీతులన్నీ-చెప్పడం వరకేగాని పాటించే మొగాళ్ళు ఈ కాలంలో యెవరున్నారోయ్? సుందరమైన వస్తువును పొందడంలో తప్పేముంది? ఆమె అందం నన్ను ఆకర్షించింది.

ప్రకా: మీ అందం ఆమెను ఆకర్షించడం లేదుగా? ఆమె మిమ్మల్ని ప్రేమించనప్పుడు మీరామెను కోరడం కేవలం తప్పేనంటాను.

జగ్గ: తప్పో ఒప్పో నీ కేమైనా అనుకో. ప్రకాశం! ఏమంటావ్? నీవు నాకు అండదండగా వుంటావా లేదా?

ప్రకా: ఇంకోసారి ఆ మాటన్నారా-

జగ్గ: ఏం చేస్తావు?

ప్రకా: నోర్మూయిస్తాను.

జగ్గ: నీలాంటివాళ్ళు లక్షముప్పైమూడు కోట్లు రావాలి! ప్రకాశం! ఆలోచించుకొని మాట్లాడు. నీ మేలుకోరే చెప్తున్నాను. ఇదిగో! యీ డబ్బు తీసుకెళ్ళు. మీ పెద్దాడి పెండ్లి చేసెయ్. తప్పిన సంబంధం అతి చేయకు (నోట్లకట్ట ముందు పడవేస్తాడు.)

ప్రకా: (డబ్బు తీసుకొని) హాఁ! హాఁ! డబ్బు! డబ్బు! ఈ డబ్బే మేడలు మిద్దెలు కట్టిస్తుంది. తలపై, రత్నాలు పొదిగిన కిరీటం పెట్టి, బంగారు సింహాసన మెక్కించి రారాజునుగా చేస్తుంది. ఈ డబ్బే సకల సంపదలతో తులదూగుతున్న సామ్రాజ్యాన్ని అమ్మించి భిక్షమెత్తిస్తుంది. ఈ డబ్బే

## నాటకం

మానవత్వాన్ని మంటగలిపించి హత్యలు చేయిస్తుంది. గొంతులు కోయిస్తుంది. ఈ డబ్బే కండ్లకు మదమెక్కించి ఘోరాతిఘోరమైన హింసలు చేయిస్తుంది. ఈ డబ్బే అందల మెక్కిస్తుంది. అడుగంట త్రొక్కుతుంది. హాఁ! హాఁ! డబ్బు! జగ్గయ్యా! ఈ తుచ్ఛమైన డబ్బుకు అమ్ముడుపోడీ ప్రకాశం. మానవుడికి ప్రతిష్ఠ కలిగేది తాత్కాలికంగా డబ్బువల్ల కావచ్చుకాని అది నిలిచేదిమటుకు మానవత్వం వల్లనే. (ఇంకా వుంది.)

జగ్గ: ప్రకాశం! ఆఖరుసారిగా చెబుతున్నాను. నా మాట విను. పిల్లలు గలవాడివి. కావాలంటే మత్తడిక్రింది ఆ పదెకరాల చెక్క నీ పేర వ్రాయిస్తాను.

ప్రకా: జగ్గయ్యా! జాగ్రత్తగా మాట్లాడు. ఈ ప్రకాశంలో ఇంకా ఉడుకు రక్తం ఉరకలు వేస్తోంది. ప్రాణమున్నంతవరకూ మీవద్ద చేయి చాపడు. మీరు చూపించే ఆశలకు మోసపోడు! మీరిలా ధనం చూపించి ఎందర్ని నాశనం చేస్తారు? ఎందరి సంసారాలు కూలద్రోస్తారు?

జగ్గ: ప్రకాశం! పులితో చెలగాట మాడుతున్నావు.

ప్రకా: కాదు, నువ్వే నిద్ర పోయిన పెద్ద పులిని మేల్కొల్పుతున్నావు.

జగ్గ: నోర్మూయ్.

ప్రకా: నోరు ముయ్యి!

జగ్గ: అఁ! ఏమన్నావ్? పెద్దా చిన్నా తారతమ్యం లేకుండా వాగుతున్నావేం వెధవా!

ప్రకా: (నవ్వి) పెద్దట, పెద్ద! ఇంకా సిగ్గులేక పెద్దనని చెప్పుకుంటున్నావు. పెద్దా చిన్నా యీ శరీరాలకేగాని ఆత్మకెన్నడూ కాదు.

జగ్గ: ఆఁ! ఆఁ! కూటికి గతిలేని వెధవకెంత మదం! ప్రకాశం! (తన ధాటీ చూపుతూ) కొండతో ఢీకొనడానికి నీకు గుండెలు చాలవు! జాగ్రత్త! కమలా-జగ్గయ్యల విషయంలో నీవేమాత్రం కల్పించుకోకు. దాన్ని నేనేమైనా చేస్తాను. నా ఇష్టానికి నేనే కర్తను.

ప్రకా: నీ ఇష్టానికి నీవే కర్తవైతే సమాజంలోని అన్యాయాన్ని ఎదుర్కోడానికి నేను కర్తను. నీవు కమలను ఏమీ చేయలేవు. జగ్గయ్యా! నీవు మానవుడవు కావు. రాక్షసుడవు. నీలో మానవత్వం లేదు. ఛీ! మానవత్వం లేని బ్రతుకు బ్రతికే దానికంటే...

జగ్గ: ఒరేయ్, వెధవా! ఒళ్ళు తెలిసి మాట్లాడు. నిన్ను నౌకరీనుండి తీసేశాను వెళ్ళిపో!

ప్రకా: మంచిపని చేశావు "అతియాశ కొలువు కొలవకు, గుడిమాన్యము చేయబోకు దుర్జనులతోడన్" అన్నాడు మహానుభావుడు. నీ నౌకరీకి నీకూ వెయ్యిదండాలు. నా కొచ్చేజీతం యిచ్చేయ్. లెక్కలు చల్లగావుంటే, కట్టెలమ్ముకొని జీవిస్తాను.

జగ్గ: నీ జీతమా? ఉండు లెక్కచూచి ఇస్తాను. (ఖాతాపుస్తకం తీసి లెక్కించి) నీకిప్పుడు కేవలం పదహైదురూపాయలు జీతం మాత్రం ఇవ్వాల్సివుంది. నీవు నాకు వుద్దర ఖాతా బగ్గా క్రింద పదహైదురూపాయల, యాభై నయాపైసలు బాకీవున్నావు. కాబట్టి ఆ యాభై నయాపైసలు ముందు యిచ్చివెళ్ళు.

ప్రకా: (చకితుడై) ఆఁ! ఏమిటి నేనే నీకు బాకీవున్నానా? అబద్ధం—ఇలా తప్పుడులెక్కలు వ్రాసే అన్యాయకుడివై గోపాలంగారిని హత్యచేశావు. పేదరైతుల నోటిలో మట్టికొట్టావు. ఇంకా కమలను నిర్బంధించ చూస్తున్నావు. ఎప్పటికైనా నీపాపంపటాపంచలై నిజం బైట పడకపోదు. రాక్షసుడా! నీవిలా ఎందరు పేదల పొట్ట చీల్చి రక్తం త్రాగుతావు? నిన్ను ముక్క

పి. దేవయ్య

# ★ త్యాగం ★

లుగా చేసినా పాపంలేదు. పాపాత్ముడా! (వెళ్లిపోవును.)

జగ్గ: నోర్ముయ్! పక్షీ! (చెంపపై కొట్టి) డొక్క చీలుస్తాను.

ప్రకా: (చెంప నిమురుకుంటూ) మంచిది జగ్గయ్యా! గుర్తుంచుకో. నీవు చేసే అన్యాయాలు ఎంతో కాలం సాగవు. ఈ రోజు నుండి కమల నిజంగా నా తోబుట్టు సోదరి. నేను నిజమైన భారతీయుడనైతే నా సోదరిని రక్షించుకొంటాను. ఆమె పాతివ్రత్య ధర్మరక్షణకై నా సర్వస్వాన్ని త్యాగం చేస్తాను. సెలవు. (వెళ్లిపోవును.)

జగ్గ: (పిస్తోలును చూపుతూ) ప్రకాశం! తిరిగి చూడు.

ప్రకా: ఎందుకు? (ఠీవిగా తిరిగి చూస్తాడు.)

జగ్గ: ఇప్పుడు ఎక్కడికి వెళ్తావు?

ప్రకా: (వికటంగా నవ్వి) హాఁ హాఁ! కాల్చుకో! తూటాలు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరవు ఆగు రంగన్నా!

(జగ్గయ్య, దృష్టిని రంగని వైపు పోనిస్తాడు. ఇంతలో ప్రకాశం అతని చేతికి కొట్టి పారిపోతాడు. పిస్తోలు క్రిందపడి పేలిపోతుంది.)

జగ్గ: తప్పిపోయింది సరి. సరే మంచిది. ఎక్కడికి కెళతావో నేను చూస్తాను. విధవకు తినటానికి తిండిలేదు. కాని ఏమో పెద్దగా నిక్కుతున్నాడు.

## 5 వ రంగం

(సమయం: సాయం॥ 5-80 గం॥ పురుషోత్తం ఇల్లు: ఒక టేబుల్, మూడు కుర్చీలు ఉంటాయి. కమల కుర్చీలో కూర్చొని కూనిరాగాలు తీస్తూ, అద్దంలో చూచుకుంటూ, తల దువ్వుకుంటూ వుంటుంది. ఇంతలో పురుషోత్తం వచ్చి కమల సంతోషాన్ని కనిపెట్టి తానుకూడా సంతోషంగా కమల కనబడకుండా వెళ్లి మృదువుగా బుగ్గపై కొడతాడు.)

కమ: (దిగ్గున లేచి భర్తను చూచి సిగ్గుతో) ఎప్పుడొచ్చారో తెలియకుండా నే...

(కోటు గుండీలు వూడదీస్తూ వుంటుంది.)

పురు: ఇప్పుడే! ప్రేయసి గారి మధుర మంజుల కోకిలారావం మధ్యలో ఆగిపోతుందేమోనని మెల్లిగా వచ్చాను. ఈరోజు నీలో వుప్పొంగుచున్న ఉత్సాహం చూస్తే నాకాశ్చర్యంగావుంది కమలా! అయితే ఈ ముస్తాబులు పుట్టింటికిపోవాలనా?

కమ: (దగ్గరకు వస్తూ) కాదు. మీతో బజారుకు వచ్చి మంచి చీరొకటి కొనుక్కుందామని... అన్నట్లు పండుగెప్పుడండీ? (పక్కన కూర్చుంటుంది).

పురు: ఏ పండుగ — ఉగాది పండుగా? వచ్చే గురువారం.

కమ: మరి చిన్నాన్నని ఎప్పుడు తీసుకొస్తారండీ?

పురు: (ఏదో ఆలోచిస్తూ వుంటాడు).

కమ: ఏమిటండీ ఆలోచిస్తున్నారు?

పురు: ఏమీ లేదు. నేను బొంబాయి వెళ్ళవలసి వుంది. అర్జంటుగా ఈ రాత్రి బండికి వెళ్ళమని అడ్వాన్సు చెక్కు కూడా హెడ్డాఫీసు నుండి పంపారు. త్వరగా ప్రయాణానికి సిద్ధం కావాలి.

కమ: ఇంత అర్జంటుగా ఎందుకండీ? పండుగ తర్వాత వెళ్ళకూడదా?

పురు: అట్లా ఆగటానికి వీల్లేదు అర్జంటైన ఆఫీసు పనులున్నాయి.

కమ: తిరిగి మళ్ళీ రావటం ఎప్పుడు?

పురు: త్వరలోనే వారం,పదిరోజులలో.

కమ: అమ్మయ్యో! వారం పదిరోజులే? ఇన్నాళ్ళు మిమ్మల్ని విడిచి నేను బ్రతుకగలనా? మీతో పాటు నేనుకూడా వస్తాను

పురు: పిచ్చిదానా! ఉద్యోగమంటే ఏమాట అనుకున్నావా? పనయిపోస్తే నెలల తరబడి కూడా వుండాలి, తెలుసా! మరి బొంబాయి నుండి నీకేం తెమ్మంటావ్, చెప్పు.

కమ: నాకు కావలసిన వస్తువు తెస్తారా?

పురు: (వినీ విననట్లు) ఏమిటా వస్తువు? అది ఎంత కొస్తుంది?

కమ: వెల చెప్పలేను గాని కొంటానికి దొరికేది కాదు.

పురు: (ఆశ్చర్యంగా) అంత అమూల్యమైన వస్తువేమిటబ్బా? (ఆలోచించి) అదేమిటో నాకర్థం కావటంలేదే? సరిగ్గా చెప్పరాదూ?

కమ: అయితే వినండి. మీరు క్షేమంగా ఇంటికి చేరడమే నాకు కావలసింది. అంతే!

పురు: ఓస్ ఇంతేనా? (నవ్వుతూ) నేనింకో బ్రహ్మాండమైన దనుకున్నాను.

కమ: తమకు లోకువవచ్చు కాని, మీరు క్షేమంగా ఇంటికి వస్తే అదే నాకమితానందం!

(ప్రభాకర్ ఈల వేసుకుంటూ ప్రవేశం. కమల కొంచెం దూరంగా జరుగుతుంది.)

ప్రభా: వదినా! వంట తయారయిందా? భోజనం చేసి బ్యాడ్మింటన్ ఆటకు వెళ్ళాలి. మా జట్టు రెడీగా ఉంది.

కమ: కొంప తీసి కట్టుకుడితే చెట్టు తెగిపోగలదు. కొంచెం నెమ్మదిగా అను. పద - అన్నం వడ్డిస్తాను. (వెడుతుంది.)

పురు: ప్రభాకర్! ఇంకా మీ సెలవు లెన్నాళ్ళున్నయ్?

ప్రభా: (వెళ్ళబోతున్నవాడు ఆగి) ఎందుకన్నయ్యా?

పురు: ఏం లేదు. నేను బొంబాయి వెళ్తున్నాను.

ప్రభా: అయితే వదినను కూడా తీసుకువెళ్తున్నారా?

పురు: లేదు. నేను ఒక్కణ్ణే వెళ్తున్నాను.

ప్రభా: అందుకు ఆలోచన ఎంటి? హాయిగా వెళ్ళిరండి!

పురు: అది కాదు బ్రదర్! నేను తిరిగి వచ్చేదాకా నీవు ఇంటివద్ద వుండడానికి అవకాశముందా అని?

ప్రభా: అచ్చే అంత అవకాశం లేదన్నయ్యా! ఎల్లుండే కాలేజీ తెరుస్తారు. అందుకని రేపే బయల్దేరుదామనుకుంటున్నాను

పురు: సరే వెళ్ళిరా. అవకాశం చిక్కనప్పుడు నీవు మాత్రం ఏం చేస్తావు?

కమ: (ప్రవేశించి) ఏమండీ మరిది గారూ! ఇక్కడే ఆడుతున్నట్లున్నారే, టెన్నిసు, ఫుట్‌బాలూ, బ్యాడ్మింటన్ అన్నీను. అన్నం వడ్డించి ఎంతకాలమయింది!

ప్రభా: అవును గాని అన్నయ్యా! వదిన గారికి బొంబాయినుండి యేం తెస్తున్నావ్?

పురు: (చిలిపిగా) ఒక లేడీస్ వాచి, ఒక కెమేరా, ఒక సూటుకేసు.

ప్రభా: ఆల్ రైట్! ఆల్ రైట్! వదిన గారికి బొంబాయంతా తెచ్చేటట్లున్నారే!

కమ: చాల్లే వూరుకోండి అన్నా-తమ్ముళ్ళిద్దరూ ఒకటయ్యారు వేళాకోళానికి. (వెడుతుంది. ప్రభాకర్ కూడా వెడతాడు.)

[ తెర ]

## ద్వితీయాంకం

### 6-వ రంగం

(సమయం: సాయంత్రం 6 గంటలు. జగ్గయ్య వీధిలో వెళ్తుంటాడు. రంగడు ఎదురువైపునుండి ప్రవేశం. ఎర్రపటాల లుంగీ, పసుపు పచ్చ పట్టాల బనియను, తలకు ఎర్రగుడ్డ కట్టివుంటుంది. చెప్పులూ, చేతిలో లావాటి కర్ర, బుర్రమీసాలూ, త్రాగి తూలుతూ "అప్పన్న తిన్నామన్నా మారోరి తైరన్నా" అని పాడుతూ ఉంటాడు.]

రంగడు: (జగ్గయ్యకు ఎదురై-జగ్గయ్యను చూచి) దండాలండీ దొరగోరూ!

జగ్గ: ఓరే రంగా! ఎక్కడికెళ్ళావురా! నీ కోసం పదిమందిని పంపించాను జాడా లేదు; జవాబు లేదు తుదకు నేనుకూడా రావాల్సిన గతిపట్టింది.

రంగ: ఎన్నించండి దొరగోరూ! మంగి చీరొకటి కావాలని మా రామి ఒకటే గోలెడుతుంటే ఊడిగాని వస్తుండా! అంతవసరమైన పనేంటుండీ రంగడితో?

జగ్గ: నీవల్ల తప్ప మరొకరివల్ల కాదా పని.

(44-వ పేజీ చూడండి)

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతసంచిక తరువాయి)

ఆ రోజుల్లో తేలగా భయంతో బెదిరిపోయింది. తన జీవితం పద్ధతి మార్చుకోవలసిన తీవ్ర పరిస్థితి ఏర్పడిందని భావించింది. అందుకు ఏంచెయ్యాలనే తీవ్ర ఆలోచనల్లో సతమతమయ్యింది రాణి.

మర్నాడు ఆఫీసుకు వెళ్ళగానే రామనరసు పిల్చి ఉద్యోగంలోంచి రాణిని తీసేశామని ఉత్తరువు అందిచ్చాడు.

"నాకు ఉపయోగించని మనిషిని గుదిబండలా ఎంతకాలం పోషించగలను?... పైగా నీ ప్రవర్తనవల్ల మా ఆఫీసుకే కళంకం వస్తోంది!" రామనరసు కోపంగా ముఖం చిట్లించుకుంటూ కారు ఎక్కి వెళ్ళిపోయాడు.

ఈ పరిస్థితి ఎప్పుడో ఏర్పడుతుంది అని ఊహిస్తున్న రాణి నిరాశపడకపోయినా ముందు సంగతి ఏమిటనే తొట్రుపాటు బహిర్గతం చేసుకోకుండా ఉండలేకపోయింది.

రాణిని చూసి కుతూహలంతో జాలిగా నవ్వింది సుశీల. రాఘవరావు ఆప్యాయతతో పిల్చి, ఆమెమీద దుర్ప్రవర్తన నేరంతో అనేక ఆకాశరామన్న ఉత్తరాలు వచ్చాయని, ఆమెను కులట అనే అభియోగంతో పోలీసులు ఆమె చర్యలు పరిశీలిస్తూ దర్యాప్తు చేస్తున్నారనీ, యీ సంగతి తెలిసి రామనరసు తన పరువు ప్రతిష్ఠలు కాపాడుకోటానికి ఆమెను ఉద్యోగంలోంచి తీసేశాడని, తన పలవోలు పాటించనందుకు యీ దురవస్థ కలిగించాడని సానుభూతి చూపాడు రాఘవరావు.

రాణి సమాధానం చెప్పకుండా ఖిన్నురాలై వీధిలోకి వచ్చేసింది. భావిగతి కూర్పు చేస్తున్న ఆలోచనల్లో ఏదో మెరుపులా మెరిసింది. మెల్లిగా నడుస్తూ విచారంగా యింటికి వచ్చేసింది.

ఒకనాడు సాయంత్రం తను కాలేజిలోని స్నేహితురాలు నాటకం ఏదో వేస్తోందని, దుస్తులు తెచ్చేఏర్పాటు తానుచేస్తానని వాగ్దానమిచ్చావని, తన ట్రంకు పెట్టె తీసుకుని రిక్షాఎక్కింది రాణి.

రాత్రికి రాణి యిల్లుచేరలేదు. మరియమ్మ బెంగపడింది. మర్నాడుకూడా రాణి జాడ లేదు. ఆఫీసుకు కబురంపితే, ఉద్యోగంలోంచి తీసివేసినవార్త తెలిసింది మరియమ్మకు. ట్యుటోరియల్ కాలేజికి స్వయంగా వెళ్ళింది, మరియమ్మ రాణిని వెతుక్కుంటూ. నెలరోజులనుంచి కాలేజికి రావటమేలేదని ప్రిన్సిపాలు సమాధానం యిచ్చాడు.

వారంరోజులు గడిచినా రాణి జాడ తెలియలేదు మరియమ్మకు. పొరుగింటి అమ్మలక్కలు రాణి కనిపించటంలేదని విడ్డూరంగా ఏవో గుసగుసలాడుకున్నారు.

ఇంటిఅద్దె పెరిగిపోయింది. పాలవాడు, దుకాణదారుడు, [illegible], యితర అప్పులవాళ్ళు డబ్బుకోసం మరియమ్మచుట్టూ తిరగటం మొదలుపెట్టారు. బెంగపడి కుమిలింది మరియమ్మ. ప్రస్తుతవిపత్తు తప్పించుకోడానికి తెలిసినమార్గం ఒకటేవుంది ఆమెదృష్టిలో. ఇంట్లోఉన్న సామానులు ఒకవేలంపాటే యజమానికి అమ్మి, ఒక అర్ధరాత్రి మూటముల్లె సర్దుకుని, వీధితలుపులకు తాళంవేసి, నిశీథంలో లీనమయిపోయింది మరియమ్మ ఖిన్నురాలై.

ఇంటియజమాని యీ సంగతి తెలుసుకుని తాళాలు బద్దలుకొట్టి, యింట్లో పాడైన సులకమంచం, చెత్తకాగితాలు, విరిగిపోయిన కుర్చీ, కదలలేని పెద్దరుబ్బురోలు, చిల్లులుపడిన యిత్తడిగిన్నె సేకరించి రెండునెలల అద్దెకు వాటివిలువ సరిపోదని చిటపటమండిపోయి అవన్నీ నేలకేసి బద్దలుకొట్టాడు.

ఇంటికెదురుగా వీధిలో విద్యుద్దీపస్తంభాల తీగలమీద చచ్చిపోయిన కాకి తలకిందులుగా వేలాడుతోంది. కుక్కలు కొట్లాడుకుంటూ భోంయ్ మని అరుస్తున్నాయి. ఇద్దరు గుడ్డి ముష్టివాళ్ళు హీనంగా అరుస్తూ పాటపాడుకుంటూ భిక్షం అడుక్కుంటున్నారు.

## 12

చాంద్రాయణగుట్ట చెన్నకేశవస్వామి ఆలయం చుట్టూ దేవుడిమీద పుష్పాక్షతల్లా నిండిన కొండరాళ్ళు ఎక్కాడు శివరాం. సాయంత్రం అయిదుగంటలయింది. ఆఫీసు సెలవుదినం ఆదివారం వస్తే తలపులు రాణిపై ప్రసరించి ఏమిటో ఉన్మాదం కలగజేస్తున్నాయి శివరాంకు. మానసికపరితాపం నుంచి తప్పుకోవాలంటే ఒంటరిగా క్రొత్త ప్రదేశ సందర్శనంలో నూతన భావాలు




చిత్రం : నేతులూరి లక్ష్మయ్య, నర్సరావుపేట

మనస్సులోకి జొనిపి ఆనందించుకోడం ఒక మార్గంలా స్ఫురించింది శివరాంకు.

ఒంటరిగా గమ్యస్థానం లేకుండా బయలుదేరి చార్ మినార్ దాటి ఆ ముందు ఏముందో అనే చింతాధోరణిలో, అంతం చూడాలని రిక్షా ఎక్కి చిన్న కోవెల ఆలయం చేరాడు శివరాం. పెద్దపెద్ద కొండరాళ్ళు చుట్టుకుని వాటిలోంచి కొండమీది ఆలయం దేవుని శిరస్సులా నిక్కి చూస్తోంది. సంస్కారం లేక, ఎక్కువ భక్తులపోషణ లేక ఆ ఆలయం శిథిలావస్థలో ఉన్నట్లుంది. ఆ గ్రామం వీధిలోంచి కొండమీదకు ప్రాకిన చట్టుబాటే గడ్డి దుబ్బులతో పెరిగి, ధూలు వారి, పాతదనం ఉట్టిపడుతోంది. కొంచెం చీకటిపడితే ఎవరైన కొండఎక్కడమంటే భయపడడం సహజం. కొండరాళ్ళమధ్య సందుల్లో కనిపించే నల్లని సొరంగాల్లో ఏ సర్పాలు దాక్కున్నయో అనే సందేహం కలుగుతుంది. కొండరాళ్ళుదాటి మెల్లిగా సన్నటిదారి చీల్చుకుని ఆలయం చేరాడు శివరాం. కొండమీద రెండు ఫర్లాంగుల ఎత్తునఉన్న ఆ ఆలయం దూరాన హైదరాబాదు నగరం యొక్క స్వరూపం స్పష్టం చేస్తోంది. ఆకాశంలో మిణుకుమంటున్న తారలతో కొండదిగువన, నగరమధ్య దూరాన వెలుగుతున్న విద్యుద్దీపాలు పోటీచేస్తున్నాయి. మానవుడే తారలకు పోటీగా భువిలో విద్యుద్దీపాలు ప్రతిష్ఠించినట్లు కనిపించింది.

పూజారి శివరాంను ఆహ్వానించాడు. నగరంనుంచి ఆ ఆలయం చూడడానికివచ్చే నాగరిక భక్తులే చాలా తక్కువ. శివరాం ఆ ఆలయంలో క్రొత్తగా అడుగుపెట్టగానే పూజారి సంతోషించాడు ఆనాడు దైవం పేర ఎక్కువరుసుము తనకు దొరుకుతుందని. ఆలయ ప్రాంగణంలో పూజారి తాలూకు వనితలు ఏదో విషయంలో ఘర్షణపడుతూ కేక లేసుకుంటున్నారు. కేకలేసుకుంటున్న వనితలను కూకలేసి పూజారి శివరాంను ఆలయ అంతర్భాగానికి తీసుకువెళ్ళి గర్భగుడి తలుపు తెరిచాడు. చిన్న కోవెల స్వామి భక్తులకు అభయహస్తం చూపుతూ పెట్టుకున్న నామం ద్వారా త్రికాలవేదిలా సర్వాంతర్యామిలా గంభీరంగా కనిపించాడు. కర్పూరంపెట్టి, తులసిదళం తీర్థం చేతికందిచ్చి పూజారి వినయంగా పళ్ళెం పుచ్చుకుని నిలుచున్నాడు. శివరాం పావలా పళ్ళెంలో విడిచాడు. పూజారి ముఖం ఆనందంతో పరవళ్ళు త్రొక్కింది.

పూజారి గర్భగుడి తలుపులు మూసి బయటకివచ్చి కూర్చున్నాడు.

పూజారి ఆలయం సమీపంలో తన కష్టసుఖాలు నివేదించాడు. శివరాం అన్నీ పరధ్యానంగా విన్నాడు. అంత ఎత్తైన కొండమీద ప్రశాంతంగా ఉన్న చిన్న కోవెలని ఆలయానికి ప్రతియేడు తీర్థం జరుగుతే ఎంతో శోభనేకూర్చేలా కనిపించింది. కొండ చుట్టూ ఉన్న క్రిందివీధిలో గిలకలు, లక్కపిడతలు, తినుబండారాలు, రంగులరాట్నాలు మొదలైన దుకాణాలతో చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వచ్చే తీర్థయాత్రికులతో సందడిగా వరదాగా ఉంటూ జాతి సంస్కృతికి ప్రతిబింబంగా కనిపిస్తుందని ఊహించాడు శివరాం. సరైనపోషణ, నిర్వహణ లేని చిన్న కోవెలని ఆలయం పురాతన చారిత్రక స్థలంగా మారిపోవడం శోచనీయం అనుకున్నాడు.

ఆలయ ప్రాంగణంలో నిలుచుని ఎత్తు కొండమీంచి పరిసర ప్రాంతాలు చూశాడు శివరాం. అప్పటికే అంధకారం వ్యాపించడంతో విద్యుద్దీపాల వెలుగునీడలు ఆ వెలుగు నీడల్లో చిన్న పురుగుల్లా కదిలే మనుష్యులు, దూరాన నల్లటి మేఘాల్లా కదిలే చెట్ల కొమ్మలగుంపులు తప్ప, యింకేమీ స్పష్టంగా కనిపించటం లేదు. ఆలయ మంటపం మధ్య వేలాడదీసిన పంజరంలో బంధించబడిన రామచిలుక ఆకుపచ్చ చీర కట్టుకుని, దొండపండు పెదాలతో మృదుమధురమైన అర్థంకాని పలుకులేవో వినిపిస్తోంది శివరాంను చూసి. భావంఅర్థం కాకపోయినా, ఆ పక్షి శివరాంకు ఎదో సన్నిహితంగా కనిపించింది. అప్రయత్నంగా దగ్గిరకేరి పంజరం కదిలించి చిలకతో కాస్సేపు మాట్లాడాడు శివరాం.

నిశ్శబ్దంలో చెదిరిన కొండరాళ్ళ మధ్య శిథిలమైన అవస్థలో, పాతదనం పొందిన ఆ ఆలయానికి, అగమ్యంగా చెదిరిన భావాలతో తిరుగుతూ శిథిలమైన హృదయంతో కొత్త కలిగించే పరిస్థితులతో కనిపించే తన బ్రతుకుకు ఎంతో సామ్యం కనిపించింది శివరాంకు. అర్థంకాని అందమైన చిలక భాషలా, దూరమైపోయిన ప్రేయసి రాణి మధుర వాక్కులు చెవుల్లో గింగురుమంటున్నాయి. ప్రాపంచిక చింతతో దైవాన్ని విస్మరించిన మానవుల్లా, అనుమానం చింతతో ప్రేమమూర్తిని నిరాదరించేనని వాపోయాడు శివరాం. తాత్కాలికంగా మనిషి తత్వం తెలుసుకోవాలని యిచ్చిన ధనం యిద్దరిమధ్య అనురాగాన్ని త్రెంచివేసింది. కారు లేచిపోయిన సంఘటన తిరిగి జీవితం మార్పులో మనశ్శాంతి పొందుతూంటే, కారుదరూపం కలిగినరాణి బ్రతుకులో ప్రవేశించి, మునుపటి బడబానలం రగిలించి, సన్నిహితురాలై, అంత్యదశలో ప్రేమను తిరస్కరించి, తన్ను త్యజించడం శివరాంహృదయాన్ని బ్రద్దలుచేసినట్లయింది.

చాంద్రాయణగుట్టవదలి రిక్షాఎక్కి మళ్ళీ నగరంలోకి ప్రవేశించాడు. మళ్ళా

# అన్వేషణ

మసీదు అరుగుల మీద పనిలేని తురకలు కోసుతూ దోమలు తోలుకుంటున్నారు. చార్ మినార్ చివర బురుజులమీద పావురాలు ఎగురుతూ గూళ్ళల్లో చేరుతూ కువకువమంటూ జనం సందడికి తాళం వేస్తున్నాయి. నాలుగోపురాలు ఆకాశంలోకి నిగిడ్చి, "అల్లాహో అక్బర్!" అంటూ నమాజ్ చేస్తున్నట్లు కనిపించింది చార్ మినార్. హోటళ్ళలోంచి ప్రేమగీతాలు హిందీలో రేడియో నుంచి మధురంగా వినబడుతున్నాయి.

రిక్షా పరుగెడుతోంది. చిన్న వాన జల్లు ప్రారంభమయింది. జనం దుకాణాల కప్పుల క్రింద వానకు తడవకుండా కొద్దిసేపు నుంచోవాలని చేరారు. నల్లని సిమెంటురోడ్డు వాన చినుకుల్లో తడిసి, విద్యుద్దీపాల కాంతుల్లో మిలమిల మెరుస్తున్నాయి. శివరాం మీదపడే చినుకులజల్లు ఆవేదనతో ఉడికిపోతున్న శరీరానికి కొంత ఉపశమనం కలిగించింది. వానలో తడిసి పోవాలనే బుద్ధి కలిగింది. రిక్షా ఆపి డబ్బు చెల్లించి వీధిలో నడవసాగాడు శివరాం. వాన చినుకులు శిరోజాలను తడిపి ముక్కలుగా మారి చెంపలు ద్వారా ప్రవహించి. అతని బుగ్గలు నిమిరి, కంఠంమీదికి జారిపోతున్నాయి. జేబురుమాలుతో ఆనీటి చినుకులను ఒత్తుకోవాలనే కోరికను త్యజించాడు శివరాం. కిళ్ళీదుకాణం దగ్గరకు వెళ్ళి ఒక సిగరెట్టు వెలిగించాడు. వాన చినుకుల తడిలో మందంగా వెలుగుతోంది సిగరెట్టు. పొగలు పైకి జిమ్మి వాన చినుకుల బరువులో ఒరిగి కరిగి పోతున్నాయి.

హోటల్లో భోంచేసి, ఇల్లు చేరాడు. తాతయ్య, చెల్లెలు, తనక్షేమ సమాచారం ప్రశ్నిస్తూ ఉత్తరాలు వ్రాశారు. ప్రత్యేక విశేషాలు లేని ఆ ఉత్తరాలు సరిగా చదవకుండానే చిత్తుకాగితాలు బుట్టలో విసిరేశాడు శివరాం. తలుపుక్రింది రంధ్రం లోంచి వీధి వరండానుంచి ప్రాకిన వాననీరు తడిపిన వార్తాపత్రిక నేలమీద [illegible]తోంది. వార్తలు చదవబోయాడు కాస్సేపు. అధికారం, అంతులేని ఖ్యాతికి ఎగబడే మానవసముదాయం కార్యకలాపాలతో నల్ల అక్షరాల వార్తాపత్రిక మసక మసకగా కనిపించింది. పత్రిక ముడిచి మూల విసిరేశాడు శివరాం.

పక్కమీద ఒరిగాడు శివరాం. తెల్ల దుప్పటి తొడుగుకుని పరుచుకున్న మెత్తటి పరుపు మల్లెపూలశయ్యలా కనిపించింది శివరాంకు. కళ్ళగలేబుతొడుగుకున్న తలగడా చిలి

పీగా పలకరించింది అతన్ని. గలీబు తెల్లచీర ధరించి, గళ్లరవిక తొడుగుకుని రాణీశయ్య మీద ఉన్నట్లు శివరాం కళ్ళు భ్రమించాయి ఒకక్షణం. కళ్లు మూసుకుని వాస్తవికత గుర్తించి నిట్టూర్చాడు. తూలుతూ మత్తుగా ప్రక్క మీద వాలాడు ఆర్పేసిన విద్యుద్దీపం వెదజల్లిన చీకట్లలో. కళ్లు తెరిచినా మూసినా చీకటి శూన్యం గోచరిస్తున్నాయి. వానజల్లు తోడుపొందిన చలిగాలి కిటికీలోంచి రివ్వున విసురుతోంది, మెత్తటి పరుపు వెచ్చదనం అందిచ్చి గిలిగింతలు పెడుతోంది. శారద, కోమటి కోడలు, ప్రమీల, కళ్ళముందు కదలారు, జీవితంలోని స్త్రీసాంగత్యరీతు లన్నీ అందీ అందని ద్రాక్షపళ్లు చూసి ఎగిరే నక్క సామ్యం ప్రతిబింబిస్తున్నాయి చిన్నప్పుడు గుడిలో పూజారి మేష్టారు వద్ద వాల్లకొను చదువుకునే రోజుల్లో రోజూ నిమ్మతొనలు, పిప్పరమెంటు లిచ్చే తహసిల్దారుగారి అమ్మాయి. చెరువులో ఈతలాడే టప్పుడు నీళ్లలో జారి మునిగిపోతున్నప్పుడు రక్షించిన జమీందారుగారి కూతురు, పొలంలోంచి మామిడికాయలు వేసవిలో యింటికి తెచ్చి సుభద్రమ్మకు అందిచ్చే పాలేరు పల్లెటూరిపిల్ల, కోవడస్తున పికారుగా రావిచెట్టు క్రింద కూర్చునేటప్పుడు ఒయ్యారంగా చిదుములు ఏరుకోడానికి వచ్చే నేతిపత్తెమ్మ కుమార్తె. కాలేజీ రోజుల్లో సైన్సు రికార్డుల్లో బొమ్మలు వేయించుకోడానికి రోజూ యింటికి పిలుపించుకునే లెక్చరరు గారి కూతురు, రాణితో మాట్లాడేటప్పుడు గ్రీన్ రూములో ఏదో వంకతో మధ్య అడ్డు వచ్చే వనజ, వారి...స్వభావాలు ఏవో ఊహాగానాల్లో నెమరు వేసుకున్నాడు. ఆలోచనలు మెలికలుగా త్రిప్పుకుంటు వారి వనితల వెనకాల దాగుని బయటపడని భావాలు తమ రహస్యాలు శివరాం చెవిలో ఏవో ఊదాయి. గుండె వేగం హెచ్చింది. నిట్టూర్పులు యంత్రం వదిలే పొగల్లా బయటపడుతున్నాయి. శరీరం వేడెక్కింది. కళ్ళు మండుతున్నాయి. తల తిరిగిపోతూంది. నిద్ర రావటంలేదు. బలవంతంగా ఆలోచనలు స్తంభింపచేసి, ప్రక్కమీద దొర్లి, బాధగా మగతనిద్రలో పడ్డాడు శివరాం.

మెదడులో కదిలిన ఆలోచనలు, భగ్నమైన కోరికలు, వాస్తవికతపొంది కలలుగా రూపొందాయి మూసినకళ్లల్లో వెలుగునీడల తెరల్లో. ప్రాతఃకాల మయేసరికి నీరసించిన దేహంతో, నిద్రలేక ఎర్రబడిన కళ్ళతో చికాకుగా లేచాడు శివరాం.

ఆఫీసుకువెళ్ళాడు శివరాం. పనిచెయ్యాలనే ఉత్సాహమే తగ్గిపోయింది. శరీరభారంతో ఫైల్సు చూస్తూ ఏదో ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు. తోటగుమాస్తాలు పలకరిస్తే, ముభావంగా పేలవంగా నవ్వేడు. క్రొత్తగా వచ్చిన కంపెనీడైరెక్టరు రీవిగా గుమాస్తాలపని పరీక్షించడానికి, కాలం వృధాపుచ్చకుండా వారిచే పని చేయించడానికి, వీలైనప్పుడు గుమాస్తాలగదుల్లో తిరగడం మొదలుపెట్టాడు. బద్ధకంగా, నిరుత్సాహంగా ఉన్న శివరాంపై సోమరితనం నిందలు మోపాడు. ఇంతకాలం జాగ్రత్తగా చురుకుగా తెలివిగాచేసిన ఆఫీసుపని అంతా త్రుటికాలంలో మర్చిపోయి అనర్హతలు ఆపాదించాడు శివరాంపై కంపెనీడైరెక్టరు. కంపెనీడైరెక్టరు చేసే అధికార నిందాస్పదమైన సూక్తులు అసలే మనోవ్యాకులతతో ఉన్న శివరాంను మరీ వ్యధపెట్టాయి. ఉద్యోగంకు రాజీనామా యిచ్చి దేశాల పాలబడి ఒంటరిగా బికారిలా తిరిగివేయాలని బుద్ధిపుట్టింది శివరాంకు. మనశ్శాంతి పొందాలంటే మార్గం రాణిని ప్రసన్నురాలు చేసుకోవడంలోనే ఉందని శివరాం ఆలోచించసాగాడు.

కాలక్రమంలో గతం మరిచి రాణి మళ్ళీ సన్నిహితురాలు కాగలదని ఆశించి శివరాం ఆమెయింటికి వెళ్ళాడు. ఆ యింటినుంచి రాణి, మరియమ్మకూడ వెళ్ళిపోయి చాలా రోజులైందని విని నిరాశతో తిరిగి వచ్చేశాడు శివరాం.

కృష్ణమూర్తి కనిపించాడు. క్రొత్త నాటకం ఒకటే ఏరుకుని, రిహార్సల్సు ప్రారంభించటానికి యత్నాలు చేస్తున్నానని, శివరాం సహకారం కావాలని మామూలుసంస్థ నిర్వాహకుడి పద్ధతిలో మాట్లాడాడు. తనకు అనారోగ్యంగా ఉంటోందని, ప్రస్తుతం నాటకాల్లో ఏమీ పాల్గొనలేనని శివరాం దూరమైపోయాడు వినయుతకమంపలికి.

ఆఫీసులో కంపెనీ డైరెక్టరు ప్రవర్తనతో చికాకు హెచ్చి శివరాం సెలవుపెట్టి ఇంట్లో సోమరిగా కూర్చునేవాడు. ప్రొద్దున్నే దాసి రాజవ్వవచ్చి వేన్నీళ్ళు కాచి స్నానాలగదిలో వుంచేది. కాఫీ తయారుచేసి మేజామీద వుంచేది. భోజనం తయారుచేసి వెళ్ళిపోయేది. ఆలోచనా మైకంలో సోమరిగా పడుండి, ప్రక్కమీద దొర్లుతూ కాలం గడిపివేసేవాడు శివరాం. మేజామీది కాఫీ చల్లారిపోయేది. స్నానాల గదిలోని వేడినీళ్ళు చల్లబడిపోయేవి. వేడి అన్నం బిరుసెక్కిపోయేది. సగంతిని, సగం తినక అన్నం కెక్కరించి విసిరేవాడు. ప్రక్కయింటివారి మేడపైభాగంమీదినించి గుముకి ఒక నల్లపిల్లి వంటింట్లోకివచ్చేది. ఒంటరిగావున్న శివరాంకు ఆ నల్లపిల్లి స్నేహితుడిగా కనిపించింది. ★

(ఇంకా ఉంది)

## ★ పిల్ల మెచ్చిన వాడు ★

మా దిక్కొచ్చింది రాణి.

"అయ్యో! గయ్యాళిగంపా! ఆకళ్లు అట్లా ఉండుతాయేమే! అవ్వ! మావాడేగాని నిన్ను చేసుకుంటే, వాణ్ణి, రెండు రోజులకు మరిపించేసి, కుక్కను చేసేసి రోజుకో ఎదవతో... కులికి..."

"అత్తా... పూరుకో యింక... జాస్తీ అయిపోతోంది నీకథ! నేనేం రంభలాడిని కాదు. నీకొడుకేం మాఅమ్మ అనేట్లు అడంగికాదు. బావ చాల మంచివాడత్తా" అంది రాణి మెత్తగా.

"చాల్లే నీ వంగనాచికబుర్లు, వన్ను లాలించి వాణ్ణి చేసుకొని, వాణ్ణి నీ చేతిలో కీలుబొమ్మగా చేసుకొని, వాణ్ణి అడ్డుగా పెట్టుకొని తైతక్క లాడాలను కొంటున్నావేమో. నా దగ్గర అవేం సాగవు. తెలిసిందా.

ఇంక నీకో దండం. నీ తల్లికో దండం. రేపు వాణ్ణి పిలుచుకొని మా వూరికి పోతాం. వాలుగిళ్లు వుతక్కొని బతుకుతాం" అంది ఖచ్చితంగా సుబ్బమ్మ.

ఇంతలో గాడిదలు తలలూంచుకొని లోపలికి వచ్చాయి.

"వీట్ని తోలేసి ఎక్కడో కొత్తవాలకు పోయాడు. రానీ ఈ రోజు చెప్తాను" అంది చుక్కమ్మ.

"ఊరుకోమ్మా. అత్త వుందనికూడా లేకుండా ఒకటే వాగుతున్నావు' అంది రాజీ.

"అననీ! ఇన్నాళ్లూ వాణ్ణి ఎట్లా చూసి వాకో తెలుస్తావుంది. ముందు వాడు రానీ చెప్తాను. అడంగులకు లొంగిపోయి గవే యిపోయినాడు" అని వీధిలోకి వెళ్లింది సుబ్బమ్మ.

ఇదే విషయంమీద తల్లి కూతుళ్ళు బిగ్గరగా వాదులాడుకోసాగారు. వీధిలోంచి అంతా వింటూ —

"అక్క...రాతుస్సుల్లా తంద్రీ" అనుకొంది "వాడొస్తే అయ్యవారింటికిపోయి అన్నం వేయించుకు రమ్మను." అని రెండు గిన్నెలు బుట్టలో వేసుకొని రైతు లిండ్లకు అన్నానికి బయలుదేరింది చుక్కమ్మ. పోతూ పోతూ వీధిలో నిల్చున్న సుబ్బమ్మను వురిమి చూసింది.

"ఏమీ" అని కసురుకొంది సుబ్బమ్మ. చుక్కమ్మ ఇక తిరిగి చూడకుండా అదే... పోయింది.

మరికొన్ని నిముషాల్లో రంగడు వచ్చాడు.

"ఏమ్మా ఈ దిలో నిల్చున్నావు! అన్నం తిన్నా?" అన్నాడు.

"తిని...ఏడ్చినట్లే వుందిలే బతుకు. చిన్నప్పుడు ఎంత ధైర్యమంతుడివి ... ఇప్పుడు యిట్ల ఈ ఆడంగులకు అడకువైపోయి ఎంత మొద్దయిపోయినావు ... రంగా...పోనీ! ... ఆ పాపం ఆ తల్లీ కూతుళ్లే అనుభవిస్తారు. రేపు తెల్లారి లేవగానే మనం వూరుకెళ్లిపోదాం. నువ్వొస్తే, పెద్దింటోళ్లు కూడా, ఇస్త్రీ పెట్టి తీసిచ్చి, గుడ్డలు వానికి రుద్దుమంటా వుండారు." అందామె.

"కనొచ్చే దే... పాపం అత్తా, రాజీ... అల్లాడిపోతారు కదమ్మా! పాపం రాజిని అత్త సంపేస్తుందింక!" అన్నాడు రంగడు.

"నెత్తి మొత్తుకున్నట్లుందిలే. ఆ మాయదారి కూతురిమీద ఎంత జాలయ్యా నీకు. ఒక తికిమించిన దొంతి."

"పెద్దామె ఎటుమంటిదైనా... నీ కోడలు చేవా మంచి పిల్లమ్మా ... నీకు తెల్దులే..." అన్నాడు ఉత్సాహంతో వొప్పజెప్పే ధోరణిలో!

(46-వ పేజీ చూడండి)

# రాశిఫలాలు

దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

30-12-1959 బుధవారం మొదలు

5-1-1960 మంగళవారం వరకు.

**మేషం:**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రస్తుతం మీరు చాలా హాయిగా ఉంటున్నారని అందరు అనుకుంటూ ఉంటారు. అది ఎంతవరకు యథార్థమో మీ ఆత్మకు తెలిసినా బయట చెప్పటానికి వీలులేకపోవటంవల్ల బెట్టుసరిగా ఉండి గౌరవంకాపాడుకోవలసివస్తుంది. అది కూడా కొన్ని విషయాలలో మంచిదేకాని ఈసమయంలో మాత్రం కొన్ని చిక్కులను ఎదుర్కోవలసివస్తుంది. మాటలలోగాని, పనులలోగాని చాలావరకు నిబ్బరం చూపటం అవసరం. దల్లగా మీవద్ద ముందు వాగ్దానం తీసుకుని అనంతరం మిమ్ములను వత్తిడిచేసే మనుష్యులుంటారు. జాగ్రత్త. వృత్తి ఉద్యోగాలలో మీఊహలు కార్యరూపం పొందగల అవకాశాలున్నవి. దూరమందున్నటువంటి బంధుమిత్రులవద్దనుంచి ఉత్సాహకరమైన వార్తలు తెలుస్తవి. విలువగలవస్తువులు కొనటంవల్లను, కుటుంబంలో అనారోగ్యకారణాలవల్లను ఖర్చులు పెరుగుతవి. ధనాదాయం ఎప్పటికప్పుడు పెరిగేటట్లు కనుపిస్తుంది. కాని పెరగదు. 2, 3 లలో సంఘకార్యాలు, మిత్రులవల్ల అనుకూలత.

**వృషభం:**

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

అవకాశాన్ని వదలకుండా మానసికంగాను, శారీరకంగాను శ్రద్ధగాపనిచేసి సాటివారి ఆదరాభిమానాలను పొందగలుగుతారు. మీవల్ల జరుగవలసిన సంఘకార్యాలు గౌరవప్రదంగా నెరవేరుతవి. అయితే సకాలంలో నిద్రాహారాలు, విశ్రాంతి లేకపోవటంవల్ల అలసట, అనారోగ్యసూచనలు కనుపించవచ్చు. శుభకార్యప్రయత్నాలు ఒక నిర్ణయానికి వస్తవి, న్యాయవర్తనము, హోదాకలిగినటువంటి పెద్దమనుష్యుల సహాయం బాగా లభిస్తుంది. సంతృప్తికరమైన ఫలితం లేని ప్రయాణాలు చేయవలసిరావచ్చు. ఈవారం దైవకార్యాలలోను, ఆధ్యాత్మిక విషయ ప్రసంగాలలోను ఆసక్తి కలుగగల అవకాశాలున్నవి. వృత్తి ఉద్యోగాలలో అనుకూల సూచనలు వస్తవి. కొంతవరకు ధనాదాయం కూడా పెరుగుతుంది. అధికారులతో అభిప్రాయభేదాలువచ్చినా చివరకు మీమాట చలామణి అవుతుంది. 31,1 తేదులలో అదృష్టసూచనలు, సంతోషవార్తలు, వ్యవహార పరిష్కారాలు.

**మిథునం:**

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఒకపని కొంతవరకు చేయటం, అది పూర్తిగా నెరవేరకముందే విసుగుపడ కనుపించి అంతటితో మరొకప్రయత్నం ఆరంభించటం ఈ మాదిరిగా క్రిందా మీదా పడుతూ లేస్తూ ఉంటారు. అందువల్ల చెప్పుకోతగ్గ కష్టనష్టాలు రాకపోయినా నిరుత్సాహం తోస్తూ ఉంటుంది. ఒకప్రక్క పట్టుదల కూడా విడువలేకపోతారు. అయితే ఇతరుల దృష్టిలో మీరు అంతులేకుండా ధనార్జన చేస్తున్నట్లు కనుపించటంవల్ల సహాయంకోరే మనుష్యులు చుట్టూ చేరుతారు. కుటుంబంలో ప్రశాంతిపరిస్థితులు ఏర్పడుతవి. భూగృహ సంబంధమైన వ్యవహారాలలో ధనవ్యయం, శ్రమకనుపిస్తవి. బాహ్య ఆడంబరం బాగా పెరుగుతుంది. మీ వృత్తికి సంబంధించిన కార్యకలాపాలలో అనుకూలమైన మార్పులు జరుగగలవు. ఈవారం రెండవభాగంలో ఆదాయంకూడా బాగుంటుంది. ఆరోగ్యం చెడుతుంది. పిల్లలమూలంగా ఆనందం లభిస్తుంది. 4,5 లో బంధువుల రాకపోకలు, ఉత్తర దిక్కునుంచి ధనలాభం, గౌరవ ప్రాప్తి.

> **గ్రహస్థితి**
>
> కన్యలో రాహువు, వృశ్చికంలో గురుశుక్రులు, వృశ్చిక ధనుస్సులలో కుజ బుధులు, ధనుస్సులో సూర్య శనులు, మీనంలో కేతువు, ధనుర్మకర కుంభ మీనాలలో చంద్రుడు.

**కర్కాటకం:**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

మీధైర్యము, యోచనాశక్తి చక్కగా వినియోగపడగలవు. ఈసమయంలో కొన్ని పనులు మీతాహతును పరీక్షిస్తున్నట్లు తోస్తుంది. కాని దైవబలంవల్ల జయప్రదం కాగలవు. మీ ఆరోగ్యం కుటుంబంలోనివారి ఆరోగ్యంకూడా సంతృప్తికరంగాఉంటుంది. ధనాదాయం బాగుంటుంది. వృత్తివ్యాపారాలలో క్రొత్తమనుష్యుల సహాయం లభిస్తుంది. స్వార్థపరులైన కొందరు ఇతరులనుగురించి దూషిస్తు మిమ్ములను పొగడినంత మాత్రాన ఉద్రేకపడి అనవసరంగా కలహాలకు దిగవద్దు, అధికారులవల్ల అనుకూలత కలుగుతుంది. మీరు అన్నివిధాలా శ్రమపడి సాధించి తయారుగా ఉంచిన ఫలితాన్ని స్నేహితుల నిమిత్తం వదులుకుంటారు. కోర్టు కచేరీలలో మీకు అనుకూలం కనుపిస్తుంది. వారాంతంలో అపనిందలురాగల అవకాశాలున్నవి. అధిక ఉష్ణంవల్ల శిరస్సుకు సంబంధించిన అవయవాలలో బాధకలిగి నెమ్మదించగలదు. 30, 31 లలో పనులలో ఆలస్యము, అశ్రద్ధ, అకస్మాద్ధనలాభం, త్రిప్పట అధికం.

**సింహం:**

(మఘ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం.)

ఎంత శ్రమచేసినా మీ ఉత్సాహం లోపించదు. పైపెచ్చు ప్రతిపనీ స్వంతంగా నెరవేర్చుకుందామనే శ్రద్ధాసక్తులు పెరగటం మాత్రమేకాక అందుకు తగినట్లు అన్నివిధాలా హంగులూ, అవకాశాలు లభిస్తవి. ఈ సమయంలో ప్రధానంగా మీ హోదా పెరుగుతుంది. మిమ్ములనుగురించి మీ బంధుమిత్రులందరికి మంచి అభిప్రాయం ఏర్పడుతుంది. వ్యవహారవిషయాలలో ఇతరులు చెప్పుతూ ఉన్నటి సలహాలు ప్రస్తుతం ఉపయోగపడవు. కుటుంబవిషయాలలో మీ ఆలోచనలు ఒక నిర్ణయానికి వస్తవి. వ్యాపారసంబంధమైన కార్యకలాపాలు అతి చురుకుగా నిర్వహించి సంపూర్ణమైన కార్యకలాపాలు అతి చురుకుగా నిర్వహించి సంపూర్ణఫలితాన్ని పొందగలుగుతారు. ఇతరుల వ్యవహారాలలో మీ బుద్ధిబలాన్ని వినియోగించి సులభంగా పరిష్కరించగలుగుతారు. తీర్థయాత్రలు మొదలయిన పుణ్యకార్యాలు నెరవేరుతవి. వారాంతంలో కుటుంబంలోనివారికి అనారోగ్యం కనుపిస్తుంది. 2, 3, 4 తేదీలలో వినోదకాలక్షేపాలు, పుణ్యవంతుల దర్శనం, శుభవార్తలు.

**కన్య:**

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

మీ మనస్సులోని ఊహలు విశేషభాగం అనుకూలంగా నెరవేరుతవి. అయితే మిమ్ములనుగురించి అసూయాపరులు కొందరు వ్యతిరేకప్రచారాన్ని ప్రారంభిస్తారు. ఈ విషయంలో మీ జోక్యం నిమిత్తం లేకుండానే అణగిపోతారు. క్రమక్రమంగా మీ హోదా పెరుగుతుంది. విద్వాంసులతో పరిచయం లభిస్తుంది. కుటుంబంలో సాధారణమైన కలతలు చెలరేగి వెంటనే అణగిపోతవి. ఆదాయం పెరగటంవల్ల అనేకపనులు సునాయాసంగా నెరవేర్చగలుగుతారు. కుటుంబంలో శుభపుణ్యకార్యాలు జయప్రదంగా

# రాశి ఫలాలు

జరుగుతవి. వారం రెండవభాగంలో మీ కష్ట సుఖాలలో అన్నివిధాలుగా ఆదుకోగల పెద్ద మనుష్యుల సహవాసం లభిస్తుంది. యంత్రాలు, అగ్ని, ఆయుధాలు మొదలయిన వాటివల్ల అపకారం కలుగకుండా చూచుకోనండి సంచారంతోకూడిన కార్యక్రమాలు అధికంగా ఉంటవి. 30, 31 తేదులలో తలవనితలంపుగా ధనప్రాప్తి. బంధువులవద్దనుంచి నిష్ఠురాలు.

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

మీ కుటుంబ పరిస్థితులు ప్రశాంతంగా ఉంటవి. అనుకున్న పనులు సక్రమంగా నెరవేరగలవు. దేహసౌఖ్యం తగ్గే అవకాశాలున్నవి. ఆదాయం క్రమంగా పెరుగుతుంది. స్నేహితులు ఎవరికి తోచిన విధంగా వారు సలహా చెబుతూ ఉండటంవల్ల కార్యనిర్ణయం చేయలేక ఆందోళన కలుగుతుంది. మొత్తం మీద ధైర్యంచేసి కార్యరంగంలో ప్రవేశించగలుగుతారు. మీ వృత్తికి సంబంధించిన పనులలో ఆలస్యం కనుపించినా సంతృప్తికరమైన ఫలితం లభిస్తుంది దూర బంధువులు కొందరు మీ సహాయం కోసం ఎదురుచూస్తూ ఉంటారు. పిల్లల ఆరోగ్యం బాగుండకపోవటంవల్ల తాత్కాలికంగా అశాంతి కలుగుతుంది. తలవనితలంపుగా అపవాదులు రావటంవల్ల మనోచింత, అందువల్ల మీ కార్యక్రమాలలో మార్పులు రాగలవు. అయితే అందువల్ల ఏవిధమైన కష్టనష్టాలు ఉండవు విశేషంగా ధనం పెట్టుబడిపెట్టి వ్యాపారంవంటి పనులలో ప్రవేశించటానికి అనుకూలసమయం 31, 1, 2 తేదీలలో సభాగౌరవం, పుణ్యకార్యాలలో శ్రమ, ఆటంకాలు.

**వృశ్చికం:**

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఒకవిధంగా ఆలోచిస్తే ఇంతకు ముందుకన్నా ఎంతో మేలు అని చెప్పవచ్చు. ఖర్చులు విశేషంగా ఉన్నా ఏదో ఒకవిధంగా ధనాదాయం పెరుగుతూ ఉండటంవల్ల చిక్కులు కనుపించవు కార్యభారం మాత్రం పెరుగుతూ ఉంటుంది. ఒకపని పూర్తిగా ముందే మరొకపనిలో ప్రవేశించవలసివస్తూ ఉంటుంది కొన్ని సమయాలలో పైవారివల్ల మాట వచ్చేసూచనలు కనుపిస్తవి, కాని అటువంటి దేమీ ఉండవు శుభకార్యప్రసంగాలు జరుగుతవి. మీ నిత్య జీవితానికి సంబంధించిన కార్యక్రమాలలో పొరపాట్లు రాకుండా జాగ్రత్తపడటం అవసరం. మీ రహస్యవిషయాలను తెలుసుకొనే నిమిత్తం ఆ పస్నేహితులమాదిరి అనుసరించే వ్యక్తు లుంటారు. కుటుంబంలో ఉత్సాహకరమైన పరిస్థితులు ఏర్పడుతవి. ఇతరమార్గాలలో ధనార్జన ప్రయత్నాలు అనుకూలిస్తవి సాధారణంగా మధ్యమధ్య కొన్ని సమస్యలు కనుపిస్తున్నా దైవబలంతో ఎదుర్కొని సాధించుకోగలుగుతారు. 4, 5 తేదీలలో మీ ఆలోచనలకు అంతరాయం, పొరపాట్లు చేయటం.

**ధనుస్సు :**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

ప్రతిపనిలోను ఖర్చులు, అధికశ్రమ కనుపిస్తుఉండటంవల్ల మనోనిబ్బరం కొంతవరకు తగ్గుతుంది. ముందు ఎంతనిదానంగా ఆలోచించినా జ్ఞాపకంరాని చిక్కులు, ప్రతిబంధకాలు తీరామీరు కార్యరంగంలో ప్రవేశించినవెంటనే ప్రత్యక్షం కాగలవు. మీకు సహాయంచేస్తామన్న మిత్రులు కూడా మీ సహాయంకోసం ఎదురుచూస్తూ ఉంటారు. సంఘంలో గౌరవపదవులవంటి బాధ్యతలు ఏర్పడుతవి. అందువల్ల మీ స్వంత వృత్తి ఉద్యోగాలలో శ్రద్ధగా పనిచేయలేక బాధపడవలసివస్తుంది. వారం రెండవ భాగంలో ప్రయాణసూచన లున్నవి, ధనాదాయమార్గాలలో ప్రతిబంధకాలువచ్చి వెంటనే అనుకూలత కనిపిస్తుంది. కుటుంబంలోని మనుష్యులవల్ల మనశ్శాంతి లోపిస్తుంది. ఎవటి వారి అభిప్రాయాన్ని తెలుసుకోకుండా ముందుగా మీరు ఏపనిలోను ప్రవేశించటం మంచిదికాదు. అ స్తివృద్ధిప్రయత్నాలు నిదానంగా అనుకూలిస్తవి, 30, 31 లలో కార్యభారం, దుర్వార్తలు.

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీరు ఇతరులసహాయంకోసం ఎదురుచూస్తు కూర్చోనవలసిన సమయంకాదు. మీ బుద్ధిబలాన్ని ఉపయోగించుకుని పాటి వారిలో ఉత్తమస్థితికి రాగల అవకాశాలున్నవి. ఈవారం దైవబలం బాగుండటంవల అన్నివిషయాలలోను అధికారం, గౌరవం, ధనాదాయం మొదలయినవి, క్రమక్రమంగా పెరుగుతవి న్యాయము, అధికారము కలిగినటువంటి పెద్దమనుష్యులు అన్నివిధాలా సహాయంగా నిలబడతారు. ఈవారం ఆరంభంలో కొన్ని ఖర్చులువృధాగా చేస్తున్నామనే అసంతృప్తికలుగుతుంది. కాని తీరాఆలోచిస్తే ఆపనులు ముందుముందు అన్నివిధాలా ఉపయోగించగలవు. మీ సలహాలు వినియోగించుకుని అనేకమంది కార్యసిద్ధి ధనలాభము పొందగలుగుతారు కుటుంబంలోని వారి ఆరోగ్యంతగ్గుతుంది కాని వెంటనే నెమ్మదిస్తుంది. వాహనాలు ఎక్కటం, యంత్రసంబంధమైన పనులుచేసే సమయంలోను జాగ్రత్తగా ఉండటం అవసరం, పుణ్యక్షేత్రదర్శనం లభిస్తుంది. 30, 31 లలో ఆత్మీయుల ఎడబాటు, విశేషధనవ్యయం, బంధువులవద్దనుంచి క్షేమ లాభవార్తలు.

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా)

అదృష్టవంతమైన కాలమే. కాని, మీ ఉద్రేకాన్ని తగ్గించుకుంటు సమయానుకూలంగా ప్రవర్తించుకోవలసి ఉంటుంది. మీ నిత్యవ్యవహారకార్యకలాపాలలో మీ ఆలోచనలు సులభంగా నెరవేరగలవు. ఆదాయం పెరుగుతుంది. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సకాలంలో రాదుకాని, అందువల్ల మీ ప్రయత్నాలకు ఆటంకం వుండదు. ఇంతకుముందు తొందరపడి చేసిన పనులు ఎదురుతిరగటంవల్ల అనవసరంగా ధనవ్యయం అవుతుంది. మీ ఆరోగ్యం బాగుంటుంది. బంధువుల కార్యసిద్ధి గౌరవం లభిస్తవి. మొదట్లో మిమ్ములను ప్రోత్సాహంచేసి ఉబ్బించి పనులు సాధించుకున్న పెద్దమనుష్యులు మీ వృత్తి వ్యాపారాదులలో పోటీకివస్తారు. అందువల్ల మీకు కలిగే చిక్కు ఏమీ ఉండదు. కాని శ్రమమాత్రం అధికంగా ఉంటుంది. స్థిరాస్తులు కొనే ప్రయత్నాలు అనుకూలించగల సమయం. అధికారులు సహాయంతో మీ కార్యకలాపాలు జయప్రదంగా నెరవేరుతవి. 1, 2, 3 తేదీలలో కలహాప్రసంగాలు స్వల్పశ్రమతో ఆదాయవృద్ధి.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఈ సమయంలో మిమ్ములను ఎవరైనా గౌరవించినా, సహాయం చేస్తున్నట్లు కనిపించినా అవతలివారు ఏఅభిప్రాయంతో చేస్తున్నారనే విషయం యోచించటం అవసరం. తెల్లనివన్నీ పాలేనని నమ్మటంవల్ల చిక్కులలో దిగవలసివస్తుంది. మీ శ్రమకు తగిన ధనాదాయం లభిస్తుంది. వృత్తికి సంబంధించిన శుభవార్తలు తెలుస్తవి. పశ్చిమ దిశనుంచి గాని ఉత్తరదిశనుంచిగాని ఆకస్మాత్తుగా ధనలాభం ఉంటుంది. కుటుంబంలోనివారి ఆరోగ్యం మధ్య మధ్య కొంతలోపించగల అవకాశాలున్నవి. కాని అందువల్ల ఆదుర్దా చెందవలసిన అవసరంలేదు. వస్త్రాభరణాలు మొదలయిన విలువగలవస్తువులు కొంటారు. ఒకటి రెండుసందర్భాలలో మీ అవసరం నిమిత్తం నీచులతో స్నేహం చేయవలసివస్తుంది. అనుభవంలో అనేక ముఖ్యవిషయాలు నేర్చుకోగలుగుతారు. పనుల త్రిడి విశేషంకావటంవల్ల మనస్సులో ఆందోళన అధికమవుతుంది. ఒక్కొక్క సమయంలో మరచిపోవటం కూడా జరుగుతుంది. జాగ్రత్తగా ఉండండి 31, 1, 2 తేదులలో ధనలాభం, అధికారులవల్ల కార్యసిద్ధి, వినోదకాలక్షేపం. 

# రాజు - రాణి

చామర్తి సుబ్రహ్మణ్యం

చాలా సంవత్సరముల క్రిందటి మాట. ఓ రాజుగారు ఓ రాజ్యాన్ని పాలిస్తూండేవారు. ఆయనకి ఓ అందమైన కుమార్తె కూడా ఉంది. చాలామంది రాకుమారులు ఆమెను వివాహము చేసుకోవాలని కోరుతూండేవారు. కాని యెంతటి అందమైన రాకుమారులు వచ్చినా ఆమెకు ఎవరూ నచ్చేవారు కారు. వచ్చినవారికి ఏవో వంకలుపెట్టి హేళన చేస్తుండేది రాకుమారి.

మంచిరోజు చూచి రాజు స్వయంవరము ప్రకటించాడు. పలుదేశాల నుండి రాకుమారులు విచ్చేశారు. రాకుమారి వారిని చూస్తూ "ఈతడు చాలా లావుగ బంతిలా వున్నాడు. నాకు నచ్చలేదు." మరియొకనిని చూచి "ఇతడు చాలా పొడుగ్గా వున్నాడు. ఛా," ఇంకొకరిని చూచి "ఇతడు చాలా పొట్టిగా ఉన్నాడు. ఛీ!" నాలుగవ వానిని చూచి, 'ఇతడు చాలా నీరసంగా వున్నాడు.' ఐదవ వానిని చూచి "ఇతడు అచ్చు అల్ల నేరేడుపండులా వున్నాడు." అని వంకలు పెట్టింది.

రా(జ)కుమారులు సిగ్గుతో వెళ్లిపోయారు. ఆఖరికి నేను ఉజ్జయిని రాజయిన విక్రమసేనుని కూడా వివాహం చేసుకోనంది. తండ్రికి చాలా కోపం వచ్చింది. కోపంతో "నిన్ను తప్పక అనాకారైన ముష్టివానికిచ్చి వివాహం చేస్తాను" అని వాగ్దానం చేశాడు."ఇదే నీ గర్వానికి,కఠినత్వానికి శిక్ష.నీకు ఏ విధంగా జీవించాలో తెలియదు. రేపు ఉదయాన్నే ఏ ముష్టివాడు ముందుగా ఈ భవనం దగ్గరకు వస్తాడో వాడే నీకు భర్త" అని కఠినంగా పలికాడు.

ఆ మరునాడుదయాన్నే ఓ ముష్టివాడు తంబుర మీటుతూ, పాట పాడుతూ ఆ రాజభవనానికి



వచ్చాడు. అతని పాట మధురంగానే ఉందికాని ముఖ వర్చస్సు మాత్రం కళావిహీనంగా వుంది. భవనంలో నుండి మృదుమధురంగా వినవస్తున్న పాటను వీనులవిందుగా విన్నాడు రాజు. ఆ ముష్టివానిని తీసుకుని రమ్మని సేవకులను పంపాడు. ఆ ముష్టివానిని తీసుకువచ్చి రాజెదుట నిలబెట్టారు.

"నీ పాట విన్నాను. చాలా బాగుంది. బహుమతిగా నా కుమార్తెను నీకు భార్యగా ఒసగుతున్నాను' అని పలికాడు రాజు. ఆ ముష్టివాడు తెల్లబోయాడు. "నే నీ కురూపిని వివాహమాడను." అని రా(జ)కుమారి తండ్రితో పల్కింది. "అలా వీలులేదు. నిన్ను నేనీ ముష్టివానికే ఇస్తాను, నా ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాను" అని పలికాడు రాజు. ఆఖరికి అసంతృప్తితో ముష్టివానిని వివాహమాడ నంగీకరించింది విధిలేక రాకుమారి.

ఆ ముష్టివాడు, రాకుమారి రాజభవనాన్ని విడిచిపెట్టారు. వారి నూతనగృహానికి నడిచి వెడుతున్నారు. వారు ఓ అడవిగుండా పోతున్నారు. "ఈ అడవి ఎవరిది?" అని అడిగింది రాకుమారి భర్తను.

"ఈ అడవి విక్రమసేనునిది" అని సమాధాన మిచ్చాడు. "అతన్ని నువ్వు ఎందుకు వివాహం చేసుకోలేదు" అనిఅడిగాడు. "నేను అదృష్టవంతురాలను కాను" అని పల్కింది రాకుమారి.

అలా పోతూండగా ఓ మంచి పుష్పములతో గూడిన ఉద్యానవనం తగిలింది. "ఈ అందమైన వుద్యానవనం ఎవరిదండీ?" అని భర్త నడిగింది. "విక్రమసేనునిది" అని జవాబిచ్చాడు ముష్టివాడు భార్యకి. విక్రమసేనుని వివాహమాడలేనందుకు చాలా విచారించింది రాకుమారి. కొంత సేపటికి ఓ పెద్దనగరం చేరారు. "ఈ నగరం ఎవరిదండీ?" అని ప్రశ్నించింది రాకుమారి. 'ఇది కూడా విక్రమసేనునిదే. దీనికే ఉజ్జయిని అంటారు" అని జవాబిచ్చాడు.

అయ్యో విక్రమసేనుని వివాహం చేసుకోకపోయ్యానే అని బాధ

## గేయ కథా మంజరి

# కోతి ప్రశ్న

శ్రీరాముడు కోతులతో
సీతను విడిపించాలని
అండగ లక్ష్మణుడుండగ
దండయాత్ర వెళ్ళినాడు.

రావణాసురుని చంపె
రాముడు తన బాణంతో
రాక్షసులను అందరినీ
రాముని సైన్యం చంపెను.

సీత తల్లి క్షేమముగా
శ్రీరాముని కలిసికొనుట
అందరు ప్రజలూ విని-ఆ
నందముతో పొంగినారు.

చిన్న కోతిపిల్ల ఒకటి
శ్రీరామునికడకు వచ్చి
విన్నవించె తన కోతుల
విన్నపమును ఒకదానిని.

"జానకి అందరికన్నా
చక్కనిదని అంటారు-
ఆ తల్లిని చూడాలని
కోతులన్ని కోరినాయి."

చిన్న నవ్వు నవ్వి పలికె
శ్రీరాముడు-జయరాముడు-
'అడ్డు లేదు-సీతమ్మను
అంతా చూడండి! రండి!'

సాయంత్రము కోతులన్ని
సభ తీరిచి కూరుచుండె
సీత వచ్చి-సభలో గల
కోతులన్నిటికి కనపడె.

సీతమ్మను చూడగానె
కోతులు పళ్ళికిలించెను
ఆంజనేయుకడకు వచ్చి
అడిగినాయి ఒక సంగతి.

"జానకి ముల్లోకములా
చక్కనిదని చెప్పారే
చివరకు శోకయినా-ఆ
చక్కని చుక్కకు లేదే"

కోతులన్ని అడిగినట్టి
కోతి ప్రశ్న కెవరైనా
జవాబు చెప్పండి మీరు-
నవాలు చేస్తున్నా మరి-!

వి. నారాయణరావు.



## రాజు - రాణి



యింది. "అయితే నీవు ఇంకో భర్త గూర్చి ఆలోచిస్తున్నా వన్నమాట. నేను నీకు నచ్చలేదా" అని పలికాడు. చివరకు ఓ చిన్న పూరిగుడిసె చేరుకున్నారు. "ఈ పూరికొంప ఎవరిది?" అని అడిగింది భర్తను. "ఇది మన ఇల్లే. ఇందులో నీవు నాతో కాపురం చెయ్యాలి." అని జవాబిచ్చాడు.

"సేవకులు ఎవరైనా వున్నారా?" అని అడిగింది. "సేవకులు ఎందుకు. ఈ ఇంటిపనంతా నువ్వే స్వయంగా చేసుకోవాలి. మన బ్రతుక్కి సేవకులు కూడానా! త్వరగా వంట తయారు చెయ్యి. నాకు చాలా ఆకలిగా వుంది." అని పలికాడు రాజకుమారితో. "నే నెపుడూ అన్నం వండలేదు. అసలు నిప్పు తయారు చేయడమే చాతకాదు. ఎలాగ?" అని పల్కింది. "నా కర్మకాద్దీ తోటి కావు. ఆడదానివైన తరువాత వంట వండడం చేతకాకపోతే ఎలాగ? సంసారమెలా చేస్తావ్?" అని కేకలేసాడు. తను వంట చేస్తూ భార్యకు నేర్పాడు వంట చెయ్యడం.

వంటయింది. వారిరువురూ అతి స్వల్పంగా భుజించారు. ఇరువురూ కటికనేలమీద నిదురించారు. రాకుమారిచాలాఅలసిపోయిన కారణాన బాగా నిద్రపోయింది. తెల్లవారింది. బిచ్చగాడు లేచి అన్ని పనులూ భార్య లేచేటప్పటికి చేసేసాడు. ఆ విధంగా రెండు రోజులు గడిచాయి.

మూడవ రోజున భార్యతో ఈ విధంగా వల్కాడు: "నా దగ్గరున్న డబ్బంతా అయిపోయింది. నీవు బుట్టలు అల్లి డబ్బు సంపాదించు" అనిచెప్పాడు. "సరే! నేను తయారు చెయ్యడానికి ప్రయత్నించగలను. అసలు అవి ఏ విధంగా అల్లాలో నేటితో అల్లితే బాగుంటుందో నాకు తెలియదు. అందులో నా చేతులు నొప్పిగా ఉన్నాయి" అని పలికింది రాకుమారి "పోని సూదితో చిరిగిపోయిన పాతగుడ్డలు కుట్టు" అని ఓ సూది, దారం, కొన్ని పాతగుడ్డలు ఆమెముందు పడేసాడు ఆమె కుట్టడం ప్రారంభించింది. అలవాటు లేని కారణంగా సూది చేతిలో గుచ్చుకొంది. రక్తం స్రవించసాగింది. అది చూచి ముష్టివాడు "నీవు ఏ సున్నితమైన పనీ చెయ్యలేవు. కావున కుండలు చేసి యిస్తాను. అవి సంతకు పోయి అమ్ముకురా!" అని చెప్పాడు.

"బాబూ! మా నాన్నగారింటి వారు ఎవరయినా చూస్తే నవ్వి పోతారు" అని పల్కింది.

"నీవు ఏ పనీ చెయ్యలేక పోతున్నావు. దానికి నీ గర్వమే కారణం. బజారులో కుండలు అమ్మితే యింతోటి పోయేదేమి భంగమా? ఈ పనీ గనుక చెయ్యలేకపోతే ఆకలితో మలమల మాడి చావవలసిందే!" అని కోపంగా పల్కాడు.

ఆఖరికి బజారుకు పోవుటకు అంగీకరించింది. కుండలన్నీ తీసికొని బజారుకుపోయి నేలమీద పరచింది. ఇంతలో ఓ సైనికుడు గుఱ్ఱముమీద అటుగా వస్తున్నాడు. ఆ గుఱ్ఱాన్ని కుండలమీదనుండి పోనిచ్చాడు. కుండలన్నీ ముక్కలైపోయాయి.

విచారంతో ఇంటికి వచ్చి జరిగిన సంగతంతా భర్తతో చెప్పింది. "నీవు చాలా తెలివితక్కువ దానవు. నీవు ఏ పనీ చెయ్యలేవు. రాజభవనంలో ఓ సేవకురాలు కావాలట. నిన్ను పంపిస్తానని చెప్పివచ్చాను. నీవు ఉదయాన్నే వెళ్ళి పనిచూసుకుని సాయంత్రమయ్యేసరికి ఇంటికి తిరిగి వచ్చేయాలి. నీకు అక్కడ మంచి భోజనమే దొరకుతుంది," అని భర్త పలికాడు.

అయ్యో! రాజభవనాల్లో నివసించి, సేవకులచే పనులు చేయించుకొనే తనకు ఈ గతి పట్టినందుకు విచారించింది. ఆనాటి నుండీ ఆమె రాజభవనంలో సేవకురాలుగా పని చేస్తోంది. ప్రతి సాయంత్రం వచ్చేటప్పుడు కొంత ఆహారాన్ని ఇంటికి తీసుకువస్తోంది. దానితో ఆ భార్యాభర్తలు హాయిగా వుంటున్నారు.

ఒకానొకరోజు ఆ రాజమహాలులో రాజుగారి పెద్ద కుమారుడు విక్రమసేనునకు వివాహం నిశ్చయించారు. రాజభవనమంతా కలకలలాడుతోంది. అందరి హృదయాల్లో ఆనందం కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తోంది. సేవకురాలిగావున్న రాజకుమారి బుట్టలో అన్నం పెట్టుకొని ఇంటికి వస్తోంది. త్రోవలో రాకుమారుడైన విక్రమసేను డగుపించాడు. ఆమె అతన్ని ఇదివరకెన్నడూ చూడలేదు. అతడే విక్రమసేనుడని ఊహించుకుంది.

అతడు ఆమెను సమీపించాడు. ఈ విధంగా పల్కసాగాడు: "నీ అందము నన్నెంతో ఆకర్షించింది. నీ చిరునవ్వులు నన్నెంతో ముగ్ధుణ్ణి

## కథలాంటి కథ

ఇద్దరు స్నేహితులు పట్నం వెడదామని వాళ్ళ డొక్కు మోటారుసైకిలెక్కి బయలుదేరారు. దోవలో వాళ్ళ మోటారుసైకిలు డైనమో చెడిపోయి లైట్లు వెలగటం మానివేశాయి. అప్పుడే చీకటిపడటం మొదలుపెట్టింది. లైటు లేకుండా పట్నం వెళ్ళటం ఏలాగని ఆలోచిస్తున్నారు. దోవలో ఒక రెండెడ్లబండి యెదురయింది. బండివాడిని నీ లాంతరు ఒకసారి మాకియ్యి, పట్నంనుంచి రాగానే నీకిచ్చివేస్తామన్నారు. సరే బాబయ్యా తీసుకువెళ్ళండి అంతకంటేనా అన్నాడు.

ఆ పడవ లైటును వెలిగించుకుని స్నేహితులు మోటారు సైకిలుమీద పట్నానికి రాసాగారు. పట్నంలో వెళ్ళని, వక జంక్షనువద్ద బీటు కానిస్టేబులు ఆపుచేసి ఏయ్, మీ మోటారు సైకిలులైటు వెలుగటలేదు నడవండి పోలీసుస్టేషనుకని దబాయించాడు. ఇంతలో చుట్టుప్రక్కల జనం నలుగురూ మూగి ఈ వింత చూస్తూఉండిపోయారు. ఇంతలో ఈ స్నేహితులు పోలీసుతో మా బండికి లైటు లేదంటావేమిటి, కావలిస్తే లైటు చూపిస్తామని అన్నారు. జనం లైటు ఏలా చూపిస్తారా అని వింతగా చూడసాగారు. అంతలో మోటారుసైకిలు నడిపే స్నేహితుడు వెనక కూర్చున్న స్నేహితునితో చూపించరా లైటు అని అన్నాడు. పడవ లాంతరు మోస్తున్న స్నేహితుడు ఇదిగో నయ్యా లైటు అని చూపించి, మేము స్టేషను కెందుకు వస్తామని దబాయించాడు. చుట్టూ మూగిన జనం ఘొల్లున నవ్వారు. అది చూచిన పోలీసు వానికి మతిలో మతిలేక వెర్రెక్కిపోయి అయితే డేంజరులైటు ఏదని అడిగాడు. వెంటనే తోటిస్నేహితునితో మొదటి స్నేహితుడు డేంజరులైటు చూపించరా అని చెప్పాడు. వెంటనే రెండవ స్నేహితుడు ఆ పడవ దీపమును వెనకవైపుత్రిప్పి అందరికీ చూపించాడు. దానితో పోలీసువాడు డంగైపోయి మొహంపై గుడ్డ వేసుకుని పోయాడు. అది చూచి చుట్టూ మూగినవాళ్లు కడుపు చెక్కలయ్యేలా నవ్వుకుంటూ ఎవరిదారిని వారు పోయారు.

రోహిణీ కుమార్.

# చెప్పగలరా చెప్పుకోండి

(1) కుక్ జలసంధి ఉన్న ప్రదేశం.

(2) టిబీ, పెరూ ఈ రెండూ ఏమిటి? ఎక్కడ ఉన్నాయి?

(3) లంబకోణమనగా ఎన్ని డిగ్రీలు?

(4) తెలుగులో మొట్టమొదటి నవల; అది రచించిన వారు.

(5) 'హాల్ ఆఫ్ మిర్రర్స్' గల ప్రదేశం? అది కట్టించిన రాజు.

(6) కవి, గాయకుడు అయిన మహారాజు.

(జవాబులు 64-వ పేజీలో)

సుఖంగా సాగిపోతోంది. ధనవంతులు, బీదవారు అనే తేడా లేదు. పేదస్త్రీలంటే అంత చులకనా? నాకు ఆయనే భర్త. ఆయనే దైవం. నీ ముఖం నాకు చూపించకు, పాపాత్ముడా!" అని గంభీరంగా కంపిస్తూ పలికింది. ఆ కంపనలో తట్ట నేల మీద పడింది. అన్నమంతా నేల మీద ఒలికిపోయింది.

అదిచూచిఅక్కడున్నవారంతా ఘక్కున నవ్వారు. ఆమె ఆ అవమానాన్ని సహించలేకపారి పోబోయింది. కాని యువరాజయిన విక్రముడు వెళ్లకుండా అడ్డు తగిలాడు. ఈ విధంగా పలికాడు. "నీవు పాటలుపాడే ముష్టివాడితో జీవిస్తున్నావు. ఎప్పుడయినా ఆ ముష్టివానిని గూర్చి ఆలోచించావా? వాడు ముష్టివాడు కాడు. వాడే వీడు. నేనెందుకు ఆ పూరిగుడిసెలో కాపురముంచానంటే నీవు ప్రతివారిని ఏదో వంకలుపెట్టి అసహ్యించుకునే దానవు. కష్టసుఖాలు తెలియబరచాలని అలా చేశాను. అలాగే గుమ్మముమీద వచ్చి కూంచుని మీదుగా పోనిచ్చింది నేనే.

"ఇప్పుడు నీకు స్వతంత్రముగా ఎలా జీవించాలో తెలిసింది. ఏ విధముగా భర్తను ప్రేమించాలో నేర్చావు. నేనే విక్రమసేనుణ్ని. ఆ ముష్టివాడివేషంలో మీ ఇంటికి వచ్చాను. నిన్ను అన్ని విషయాలలో పరీక్షచేసాను. నెగ్గావు. నేడే అసలైన మన వివాహం." అని నిజాన్ని అంతా విప్పి చెప్పాడు బిచ్చవాని వేషమేసిన విక్రముడు. రాకుమారి కళ్ళనుండి ఆనంద బాష్పాలు జల జలా రాలాయి. తన కోరికలు ఫలించాయి, తన ఆశలు ఈడేరాయి అని ఆనందించింది.

వారిరువురు రాజభవనానికి వెళ్ళారు. రాజకుమారి తండ్రికి కబురంపారు. జరిగిన సంగతంతా చెప్పారు. ఉజ్జయినీ వంశంలో జన్మించిన రాకుమారులకు మారువేషములలో వెళ్ళి తమకు నచ్చిన రాకుమారిని తీసుకువచ్చి మారు వేషములోనే వివాహము చేసుకోవాలిట. అదీ వారి ఆచారం.

నగరమంతా తోరణాలతో అలంకరించారు. విక్రమసేనునికి, రాకుమారికి అతివైభవంగా వివాహం జరిగింది. పాటలు పాడే ముష్టివాడు రాజుగాను, సేవకురాలిగా ఉన్న యువతి రాణిగాను మారారు. చాలా సంవత్సరాలు సుఖంగా జీవించారు. ★




చిత్రకారుడు: పుల్లారావు, కాకినాడ.

#  త్యాగం 

చాలా అవసరమైనపని! నీవు ధైర్యస్థుడవు. తెలివికల బుజ్జివు. నీ పేరంటే చుట్టుప్రక్కల గ్రామాలు హడలెత్తిపోతాయి.

రంగ: (మీసం దువ్వుతూ) ఇప్పుడేముంది బాబూ! ఇంక ముందు ముందు చూస్తారుగా, ఈ రంగడి ప్రతాపం!

జగ్గ: రంగడూ! ఇటురా!

రంగ: (దగ్గరకు వస్తాడు)

జగ్గ: (రంగని చెవిలో) కమల నన్ను అవమానించిన సంగతి నీకు తెలిసేవుంది. అది నామాట వినడంలేదు. అందుకు నీవు సహాయం చెయ్యాలి. కావలసినంత డబ్బు ఇస్తాను.

రంగ: ఒక్క దెబ్బతో మీకుక్క నాగ చేయనుండీ? (కర్ర నేలపై కొడతాడు)

జగ్గ: తొందరపడకు. ఇప్పుడు పురుషోత్తం ఇంటిలో లేడు. బొంబాయి వెళ్లాడు. అతడు రావటంతోటే (రంగని చెవిలో ఏదో చెప్తూ) నమ్మేటట్లు నూరిపోసి ఇద్దర్నీ విడదీయాలి. అప్పుడుగాని పని పూర్తిగాదు.

రంగ: వహ్వా! చాలాబాగా ఆలోచించారండీ దొరగారూ! (నవ్వుతాడు)

పురు: (బూట్లచప్పుడు)

జగ్గ: (బూట్లచప్పుడు విని) అదుగో! ఎవరో వస్తున్నట్లున్నారు. నీవెళ్ళి ఆమూలన దాక్కో! లేకపోతే కొంపదీసి దుంప తెగుతుంది.

(రంగడు వెళ్లి ఒకమూల దాగివుంటాడు. జగ్గయ్య ఎడమనుండీ, పురుషోత్తం కుడినుండి బెడ్డింగ్ పట్టుకొని ఎదురౌతారు. పురుషోత్తం జగ్గయ్యను చూచి)

పురు: నమస్కారమండీ!

జగ్గ: ఎవరూ? పురుషోత్తమా! నమస్కారం. బొంబాయి వెళ్ళారటగా ఎప్పుడొచ్చావ్?

పురు: ఇదేరావడమండీ. (ముందుకు వెళ్లబోతాడు.)

జగ్గ: (అటూ ఇటూ చూచి) నీ కొక విషయం చెప్పాలనుకున్నాను. నీవు కలవటమే లేదు.

పురు: ఏమిటా విషయం? దయచేసి త్వరగా చెప్పండి. వెళ్ళాలి.

జగ్గ: ఊరు చేరుకున్నాక ఇల్లు చేరలేక పోతావా? తొందరెందుకు? (మెల్లిగా) పురుషోత్తం! ఆపాడుదేవుడు మంచివాళ్ళకు చెడ్డవాళ్ళ స్నేహం భలేగా కల్పిస్తాడోయ్!

పురు: మంచివారెవరూ? చెడ్డస్నేహమేమిటి? నాకేమీ అర్థంకావటంలేదు. సరిగ్గా చెప్పండి.

జగ్గ: చెప్పటానికి నోరాడ్డం లేదు నాయనా!

పురు: అంత అసహ్యమైన విషయమేమిటబ్బా?

జగ్గ: పురుషోత్తం! నువ్వు ఉత్తముడివి, కాబట్టి చెప్పకతప్పదు. (ఆలోచిస్తూ వుంటాడు.)

పురు: జగ్గయ్యగారూ! బాధించక త్వరగా చెప్పండి. ఆ రహస్యమేమిటో?

జగ్గ: మీరు బొంబాయికి వెళ్ళగానే మీభార్య ప్రభాకర్‌తో... సాంగత్యం... ఏం చెప్పాలి! ఏం కిదకిదలూ, ఏం కిలకిలలూ చూచేవాళ్ళు చెప్తుంటే చెవులు చిల్లులు పడుతున్నాయి. మీ గృహం వేశ్యాగృహంగా మారింది. ఎప్పుడూ ఏకళంకమూ లేని మీ వంశానికి ఈనాడు మీభార్య తెచ్చిన కళంకము ఇంతింతని వేరచెప్పాలా! ఇక అన్నీ మీరే గ్రహించుకోకలుగుతారు. లోకం కోడై కూస్తోంది.

పురు: జగయ్యా! నీకు మతిపోయిందా! నా కమల అలా ఎన్నటికీ చేయదు.

జగ్గ: ఆ గ్రుడ్డినమ్మకంలో వుండబట్టే వాళ్లు ఎన్నాళ్ళనుంచో నాటకమాడుతున్నారు. ఎదురైనవాడల్లా కమలమొగుడు వీడా వాడా అని అడుగుతూవుంటే తల కొట్టేసినట్లుగా అనిపిస్తూంది.

పురు: ఆఁ! కమల - ప్రభాకర్లు ఇంత నీచంగా ప్రవర్తిస్తున్నారా? కాలేజీకి వెళ్తానని తొందరపడ్డవాడు ఎందుకు ఆగాడు? ఇందులో ఏదో రహస్యముంది. లేకపోతే నేను బొంబాయి వెళ్తున్నానని చెప్పిగానే హాయిగా వెళ్ళిరమ్మని ఎందుకంటాడు? కమలా! నీవింత అపరాధానికి పూనుకున్నావా? నిన్ను నా చేతుల్లో ముక్కలు ముక్కలుగా చేస్తాను. (కోపంతో మైమరచి పొమాదులలాగే వదిలి వెళ్తాడు.)

(జగ్గయ్య అటు ఇటు చూచి ఈల వేయును. రంగడు మెల్లిగా ప్రవేశించి, పెద్దగా నవ్వుతాడు.)

జగ్గ: చూచావా? మనంవేసిన పాచిక ఎలా పారిందో?

రంగ } : (ఇద్దరూ విరగబడి నవ్వు
జగ్గ } కుంటారు.)

జగ్గ: ఇప్పుడు నాకోరిక నెరవేరిందన్నమాటే. నామాట నమ్మతాడో నమ్మడో అని నాగుండె దడ దడ కొట్టుకుంది.

రంగ: ఎంత తేలిగ్గా నమ్మాడండీ పిచ్చోడు! (నవ్వును.)

జగ్గ: అరరే! ఇదేమిటి? పెట్టె-పరుపు ఇక్కడే వదిలిపెట్టి వెళ్ళాడే!

రంగ: అదృష్టమంటే ఇదేనండీ దొరగారూ!

(బజారు దృశ్యంలోని తెరగానే, పురుషోత్తం ఇంటిదృశ్యం. అలంకరణంతా పూర్వం మాదిరిగానే ఉంటుంది. ప్రభాకరం తన పెట్టె, బెడ్డింగు తన గుడ్డలు సర్దుకుంటూ ఉంటాడు.)

కమ: (టీ తీసుకుని ప్రవేశించి చూచి) ఏంచేస్తున్నావు ప్రభాకర్!

ప్రభా: దుస్తులు సర్దుకుంటున్నాను.

కమ: ఎందుకు?

ప్రభా: కాలేజీకి వెళ్ళడానికి.

కమ: మీ అన్నగారు వచ్చినతర్వాత వెళ్ళకూడదా?

ప్రభా: అలాగే అనుకొని నాలుగురోజులాగాను. ఇంకా అన్నగారిజాడే అగుపించడంలేదు. ఏంచేయను?

(ఇంతలో పురుషోత్తం వచ్చి ఇద్దర్నీ చూచి మండిపడుతూ ఇంకేమిజరుగునో చూద్దామని దాగివుంటాడు.)

కమ: మీ అన్నగారు రావడానికి ఆలస్యమైనా నీవున్నావనే ధైర్యంతో జీవిస్తున్నాను. నన్ను ఒంటరిగా విడిచి వెళ్ళిపోతావా ప్రభాకర్!

ప్రభా: వదినా! నిన్నొంటరిగా విడిచి వెళ్ళటానికి నాకు మనస్కరించడం లేదు. కాని ఏమిచేయను. రేపైనా కాలేజీకివెళ్ళకపోతే చాలకష్టం. అందుకని నే వెళ్ళక తప్పదు. అయినా నేవెళ్ళినా నా ఆత్మ మీవద్దనే ఉంటుంది. వట్టి కట్టెమాత్రమే మిమ్మల్ని విడిచి వెళ్ళేది.

కమ: ప్రభాకర్! నన్ను నీవు నిజంగా ప్రేమిస్తున్నట్టయితే ఆగిపో; లేదా వెళ్ళిపో!

ప్రభా: వదినా మీ పవిత్రహృదయాన్ని మనస్ఫూర్తిగా ఆరాధిస్తున్నాను. నా ప్రాణంవున్నంతకాలం మీపట్ల నాకెలాంటి విరక్తి కలగదని విశ్వసించండి. దగ్గరతీసిన వారికి మోసంచేయడం నా చేతగాదు.

కమ: చాలించండి! మీ కాలేజీ స్టూడెంట్సు నిర్దయులు.

ప్రభా: అలా అనకు వదినా! నాకుకోపం వస్తుంది.

కమ: అయితేమనవద్ద ఔషధముందిగా. ఇదిగో టీ కోపాన్ని అణచివేస్తుంది. కాస్త పుచ్చుకోండి. (టీ సాసరులోపోసి నోటికందించబోతుంది.)

ప్రభాకరం: (సాసరు అందుకొని త్రాగుతూంటాడు. పురుషోత్తం పట్టరాని కోపంతో ఒళ్ళు మరచి ప్రవేశిస్తాడు. కాలికి కుర్చీ తగిలి శబ్దమౌతుంది.)

కమ: (అదిరిపడి వెనక్కు తిరిగి పురుషోత్తమును చూచి) మీరా స్వామీ! మీ పాదాలకు దెబ్బ తగిలిందా? (పాదాలు ఒత్తును)

పురు: (క్రోధంతో పళ్లు కొరుకుతూ) ఛీ! నీచురాలా! నీముఖం చూడరాదు. వెళ్లిపో బయటకు! (తన్నును) (ప్రభాకర్ టకప్పున వదలి నిర్ఘాంత పోతాడు)

కమ: ఏమిటండి! మీరిలా మారిపోయారు?

పురు: (వికటంగా నవ్వి) నేను మారిపోయానా? నీవు మారిపోలా దుష్టురాలా! (మళ్ళీ తన్నును)

కమ: అమ్మా! (బాధతో నేల కొరుగును

పురు: (వెంట్రుకలు పట్టి లాగుతూ) ఇంకా అమ్మా అని అరుస్తున్నావా? పాతకీ! నిన్ను తునాతునకలు చేసినా పాపంలేదు.

ప్రభా: అన్నయ్యా ఆగు! వదులు వదినను! ఆమె మిమ్మల్నేమన్నదని బాధ పెడుతున్నారు?

పురు: అరే ద్రోహీ! నీవు నీప్రాణాల మీద తీపివుంటే తక్షణమే ఇంటిలోనుండి వెళ్ళిపో! లేకపోతే పేగు తీస్తాను.

ప్రభా: ఎందుకు?

పురు: ఎందుకా! వదినా వదినా అంటూ మాయనాటకమాడి నన్ను మోసపుచ్చినందులకు! నా జీవితానికి మాయని మచ్చను తెచ్చిపెట్టి నన్ను నలుగురిలో నగుబాట్ల పాలు చేసినందులకు! తిన్నయింటి వాసాలు లెక్కపెట్టే ద్రోహి! వెళ్ళిపో!

ప్రభా: ఆలోచించే మాట్లాడుతున్నావా అన్నయ్యా!

పురు: ఆలోచించాను కళ్ళతో చూచాను. చెవులతో విన్నాను. మీ ప్రేయసీ ప్రియుల (ఇద్దరినీ వ్రేలితో చూపుతూ) ప్రణయోజ్వల మధుర సంభాషణలూ కేళీ విలాసాలూ! నా స్వత్వాన్ని గుర్తించడం ఎంత తప్పు? ఇంక నాకండ్లు కప్పలేరు. వెళ్ళిపోండి ఇంట్లోనుండి. ఛీ! ఛీ సిగ్గు తప్పిన కుక్కల్లారా!

ప్రభా: మీరు చదువుకున్న తెలివితేటలు ఇవేనా అన్నయ్యా? హృదయాల స్వర్గం చేరుకోక, ప్రేమ మహత్తును గుర్తు పట్టలేక పోతున్నారు. తల్లిని బిడ్డా, బిడ్డను తల్లీ ప్రేమించడం తప్పా అన్నయ్యా?

పురు: నోర్మూయ్ పక్షీ! (చెంపపైకొట్టి) నీ నీతులే నన్నింతవరకూ తెచ్చింది. ఇంకా తడిగుడ్డతో గొంతుకోయ ప్రయత్నించకు వెళ్ళిపో!

ప్రభా: (చెంప నిమురుకుంటూ) వెళ్తున్నాను... కానీ ఒక్కమాట. ఆ తల్లి ఎలాటి పాపమూ ఎరుగదని నేను భగవంతుని సాక్షిగా చెపుతున్నాను. నమస్తే. (వెడతాడు)

పురు: (వికటంగా నవ్వుతూ) ఆహా... దిగివచ్చాడోయ్ సత్యహరిశ్చంద్రుడు! నిజం చెప్పడానికి.

కమ: (పాదాలపైబడి) స్వామీ! మీ పాదదాసిని మొరలాలకించండి. నేను నిర్దోషిని.

పురు: ఓసీ! మాయలాడీ! ఇంకా సంసారివని శ్రీరంగనీతులు చెప్తున్నావా! కట్టుకున్న భర్తను నట్టనడిసముద్రంలో నెట్టివేసి విటుడితో కూడి కులుకుతున్న కులటా! పో అవతలికి.

కమ: (ఏడుస్తూ) అవును. మీలాంటి హృదయం లేనివారు స్త్రీని కులటగా—సానిగా భావించకపోతే కులసతిగా—సంసారిగా భావిస్తారా? పురుషుడు ఎన్ని తప్పులు చేసినా సత్యశీలుడు. స్త్రీ ఏ తప్పూ చేయకున్నా సాని. ఇదేనా మీ మగవారి నడకా, ధర్మమూ? మిమ్మల్ని దైవముగా ఎంచి పూజించినందులకు ఇదియేనా ప్రతిఫలం? ప్రభూ! దిక్కులేనిదానికి మీరే దిక్కనుకున్నాను స్వామీ! (పాదాలు పట్టుకొనును)

పురు: (దూరంగా జరిగి పెద్దగా నవ్వుతూ) నీ హృదయపూర్వకంగా ప్రేమించిన ఆ ప్రభాకరే నీకు దిక్కు. వెళ్లు. వాడి వెంటనే వెళ్లు! పో!

(దుఃఖంతో) శ్రీహరీ! శ్రీహరీ! (చెవులు మూసికొని) ఎటువంటి ఘోరాతి ఘోరమైన మాటలు మాట్లాడుతున్నారు? (పాదాలు పట్టబోతూ) మీ పాదాల సాక్షిగా చెప్తున్నాను. ప్రభాకర్ నా కన్నకుమారునితో సమానం. అతనినా మీరు అనుమానించడం. అన్యాయం. మరిది వదినను మాతృసమానంగా చూడడం తప్పా స్వామీ?

పురు: ఛీ! కాలసర్పమా! నీ కల్లబొల్లి మాటలు నా ముందర చెల్లవు. నీకు ముందటి పురుషోత్తం కాడు, నీ మాయలో చిక్కడానికి? ముందు బైటకు వెళ్లు. అగ్నిసాక్షిగా పరిణయమాడిన భర్తకు ద్రోహం చేసిన సానివి. ఇక నీ ముఖం చూడరాదు. వెళ్లిపో!

కమ: అనుమానపిశాచానికి బలైపోయి వాస్తవాన్ని గుర్తించలేకపోతున్నారా? ప్రభూ! మీ పాద దాసిని రక్షించండి! శాంతించండి!

పురు: శాంతి! హా హా హా హా! నీవు చచ్చినావే నాకు శాంతి. వెళ్లిపో! పో! పో!

(ఇంకావుంది)

## నిర్వచనం

మతులూ, వాటితోపాటు మాటలూ, వాటినిబట్టీ అర్థాలూ మారుతున్నాయి.

'నేను అర్ధాంగి' తొడుక్కున్నా' అన్నాడు ఒకడు.

'ఓహో పొట్టిచొక్కా - (హాఫ్‌షర్టు) కొచ్చినతిప్పలా' అనుకున్నాడు మరొకడు.

# ★ హరివంశము ★

(19-వ పేజీ తరువాయి)

వచ్చింది. ఇంతకంటే చెట్టిదం ఏమివుంది! సరే! మీరు ప్రేమించుకున్నారు. నేను కాదనను కాని మీరు చేసిన యీపని ఎట్లా చూచినా ధర్మం అనిపించుకోదు ఎప్పుడూ అది వేదసమ్మతం కాదు. వేదం బ్రాహ్మణులు అగ్నిసాక్షికమైన వివాహాన్నే విధించింది, ఇతర వివాహాలు చెల్లవు. అవి క్షత్రియులకు. నువ్వు వేదాన్ని క్రియలో దూషించావు. వాచా ఒక్క ద్విజ శ్రీ శైల రాయణుణ్ణి దూషించగా ఆమోదించావు. నువ్వు ఇక వేద ధర్మం చెల్లుతున్న నేల్లో వుండడానికి తగవు. ఈ నీ ప్రేమకత్తెను తీసుకొని యవనదేశాలకు వెళ్లు వేదాన్ని త్యజించిన క్షత్రియులు వాళ్ళు. అక్కడ మీరు యథేష్టంగా విహరించవచ్చు. ఈమెను నువ్వు అక్కడ వివాహమాడు. అది అక్కడ ధర్మమే కావచ్చు."

శైశిరాయణుడు మాట్లాడలేదు. గోపాలి మాట్లాడలేదు. తక్కిన ప్రేతలు దిగ్భ్రాంతులై చూస్తూ నిలబడ్డారు గర్గుడు మళ్ళీ అన్నాడు: "శైశిరాయణ! మీ యీ అధర్మసంపర్కంవల్ల పుట్టే శిశువువంశంలో కాలకు ఎటువంటి ప్రళయాలు సంభవిస్తాయో! అనే నా విచారం ఇక మీరు వెళ్ళవచ్చు. నేను మథురకు పోతున్నాను. మీరుగూడా ఇప్పుడే బయలుదేరి వెళ్ళండి."

గర్గుడు తర్వాత నందుణ్ణి సంబోధించాడు. "నందా! నావలన మీ ప్రేపల్లెలో జరగరానిపని జరిగింది. దీనిఫలితం ఎట్లావుంటుందో నేను చెప్పలేను. మీరు జాగ్రత్త! మీ పిల్లలు జాగ్రత్త!! వీరిని జాగ్రత్తగా పంపించు. ఇక నేను వెళ్లివస్తాను." తర్వాతగర్గుడు బయలుదేరాడు. నందుడు ఆయనకు కొంతమంది ప్రేతలను తోడు యిచ్చి ఆయన్ను సాగనంపి, తిరిగివచ్చాడు. గోపాలీ శైశిరాయణులు గర్గుని విడిదిఇచ్చిన కుటీరంలోనే కూర్చుని వున్నారు. నందునికి శైశిరాయణుణ్ణి చూడగా జాలివేసింది. గోపాలిని చూడగా జాలి వేసింది. ఊరంతా ఇంకా సద్దుమణిగేవుంది. తెల్లవారడానికి ఇంకా ఆలస్యంవుంది. ఇప్పుడు ఇక్కడ ఆలస్యం పనికిరాదు. నందుడు తన యింటికి వెళ్లాడు. యశోదను లేపాడు. జరిగిన సంగతి చెప్పాడు. వారిద్దరు కలిసి రోహిణీదేవిని నిద్ర లేపారు. ఆవిడకు చెప్పారు. ఆవిడ అన్నది: "నందా! గోపాలి ప్రేపల్లెకు ఆడపడుచు. అది ప్రేమించినా బ్రాహ్మణుణ్ణి ప్రేమించింది. దాన్ని ఆడపడుచునుపంపించినట్లు పంపించు." నందుడు "అమ్మా! అట్లాగే," అన్నాడు.

తెల్లవారేసరికి ప్రేపల్లె మామూలు ప్రేపల్లెగావుంది. ఎవ్వరికీ గోపాలి కన్పించలేదు. దాని సంగతే ఎవరికీ తెలియదు. నందుడు వారిని సాగనంపివచ్చి యమునరేవులో కాళ్లు తడుపుకుంటున్నాడు. యమున తనకు ఏమీ తెలియనట్లు, అసలు తన ఒడ్డున ఏమీ జరగనే లేదన్నట్లు, మందంగా, అందంగా, ఉదయవాయువులు లేపిన చిరుతరంగాల హంసలతో చందంగా, చిందులు త్రొక్కుకుంటూ, మందలను దాటుకుంటూ, ఎక్కడికో, ఎందుకో ప్రవహించుకుంటూ, చిరంతన యాత్రికురాలు, నిరంతరామ్రేయమూర్తి, సంగుని పాదాలను గలాగలా క్రమ్ముకుంటూ, జలజలా ముంగుకు సాగిపోయింది.



# ★ పిల్లమెచ్చినవాడు ★

"నా కోడలంటావేమి? అదా నా కోడలు. ఆ గయ్యాళిగంప: తల్లికిమించిన ధనిక! నిన్ను ఒక రోజుకు తిక్క తిరించిదంపేసుకుదూ" అని లోపలికి వెళ్లింది సుబ్బమ్మ.

"నీకు తెల్దులేమ్మా..."అంటూ రంగడూ లోపలికి వచ్చాడు.

చుక్కమ్మ అన్నం తీసుకొనిరాగానే అందరూ భోజనం చేశారు.

భోజనం చేస్తున్నప్పుడే..."నా కూతుర్ని నీ అహంగికొడుక్కు యివ్వనని"చుక్కమ్మ, "నీ గయ్యాళిగంపను నా లక్షణమైన కొడుక్కు తీసుకో"నని సుబ్బమ్మ బిగ్గరగా అరుచుకొని శపథాలు చేసుకొన్నారు

తనకు రంగడికి ఇక పెళ్లిచేయరని రాజి దృఢపరుచుకొంది.

ఆ రాత్రి చుక్కమ్మ సుబ్బమ్మ బిగ్గరగా మాట్లాడుకొని అలసిపడుకొన్నారు.

ఉదయం లేవగానే కొడుకుకోసం చూసింది సుబ్బమ్మ. కొడుకును పిలుచుకొని పూరికెళ్లి పోవాలని ఆమె నిర్ణయించుకొంది.

కళ్ళు తెరవగానే రాజికోసం ప్రక్కకు చూసింది చుక్కమ్మ. ఇక రంగణ్ణి కన్నెత్తి కూడా చూడకని నిక్కచ్చిగా రాజికి చెప్పేయాలని తీర్మానించుకొందామె.

పక్కలో రాజి కనిపించలేదు. పెరట్లో వుందేమోనని వెళ్తే అక్కడా కనిపించలేదు. వీధిలో నీళ్లుచల్లి ముగ్గులు పెడుతోందేమోనని వీధిలోకి వెళ్లి చూసింది. అక్కడా కనపించలేదు

సుబ్బమ్మకూ కొడుకు కనిపించలేదు. ఇద్దరూ కంగారుపడినారు.

ఇంతలో ఎదురింటావిడ నిప్పుకోసం అక్కడికొచ్చి "ఏమమ్మా అట్లా దిగులుగా వున్నారూ?"అని అడిగింది.

"ఈ పిల్లెక్కడా అని చూస్తున్నా!" అంది చుక్కమ్మ.

"మా వాడెక్కడా అని చూస్తున్నాను" అంది సుబ్బమ్మ.

"ఇంకేం! నాకప్పుడే తెలుసు! ఇదంతా ఈ సుబ్బమ్మచేసిన ఏర్పాటే. అన్నివిధాలా నిన్ను కష్టపెట్టాలనిలే ఈవిడ యెత్తు! ఆ రంగడూ పోచికోలుకబుర్లుచెప్తుంటాడని ఏమో అనుకున్నాంగానీ...గట్టివాడే మొత్తానికి. మెల్లగా పిల్లనుకాస్తా లేవదీసుకుపోయాడు" అంది ఎదురింటావిడ బిగ్గరగా.

"అయ్యో ఆ గయ్యాళిపిల్లకోసం నేను పడిచచ్చాననుకుంటావమ్మా! అది నాకడప తొక్కితే పిప్పిగలగొట్టేస్తాను. ఎంత నాతో ఒక్కమాటయినా అనకుండా ఎంతపని చేసేడూ?" అని రాగం తీసింది సుబ్బమ్మ.

"మంచి ఘటికుడే మొత్తానికి వీడొక్కడు" అంది మళ్ళీ ఎదురింటావిడ.

"ఏడ్సినాళ్ళే! వాడి గటితనం నాకు తెల్దూ. వాడూ చవటసీనుగ! ఇంకా మా పిల్ల ఘటికురాలు.అదే లేవదీసుకొని పోయుంటుంది ఆ అహంగివెధవని. బుద్ధిలేని కూతురే! ఇంకెక్కడా మొగుడే దొరకడని ఈ ఎదవని లేవదీసుకు పోయింది" అని విసురుగా లోపలికి వెళ్లిపోయింది చుక్కమ్మ.

"అన్నా" అని ముక్కుమీద వేలేసుకొన్నారు మిగిలిన ఇద్దరున్నూ!.



భార్యాభర్తలకి మాటా మాటా పెరిగింది. భర్త అగ్నిహోత్రావధానులయి "ఈ వెధవ కొంపలో వుండడముకన్న సముద్రములోపడి ఛావడం నయం." అని చరచర వెళ్ళి వీధితలుపు తీసేడు. పైన వర్షము పడుతోంది. తలుపువేసి నెమ్మదిగా తిరిగివచ్చి అన్నాడు. "నీ పుణ్యము పుచ్చింది. పైన వర్షము పడుతున్నాది గాని లేకపోతే ఈపాటికి సముద్రంలో పడిపోయేవాణ్ణే."

— బాబూరావు.

## వనితాలోకం



# —జననీ జన్మభూమిశ్చ...—

**పి. వేదవతీదేవి**

తొలకరి జల్లులు చిటపటలాడుతూ పడుతున్నాయి. ఎండి నెర్రెలుపడిన మట్టి నేలలోనుంచి ఒకవిధమైన కమ్మని వాసన వస్తూంది. సన్నని గాలి వీచినప్పుడల్లా వాకిట్లోని సన్నజాజి పందిరినుండి వచ్చే కమ్మని పరిమళం ఆహ్లాదకరంగా ఉంది.

ఇంతటిమనోరంజకమైన వాతావరణంలో వరండాలో ఒక ఈజీచెయిరువేసుకుని, మన అభిమానరచయిత నవల నొకదానిని వొళ్లో పెట్టుకుని - మధ్యమధ్య ఈ తొలకరి చినుకుల్ని అవలోకిస్తూ, ఈసుగంధాన్ని ఆఘ్రాణిస్తూ - సాయంత్రాలు గడపడంకన్న వాంఛనీయం మరొకటి ఉండదు. నేనూ అదే చేస్తున్నాను.

ఇంతట్లో ఎక్కడనుండో, సుడిగాలిలా దూసుకువచ్చి మంజులనావళ్లోవాలి 'పిన్నీ!' అంది.

తీయని ఈ ప్రశాంతతలోనుంచి రసవత్తరమైన కథాగమనంలోనుంచి ఒక్కసారి అదిరిపడి చూశాను.

'నిన్నే పిన్నీ'...ముఖం పైకెత్తి మంజుల నాగడ్డం పట్టుకుంది.

అది రాకాసిపిట్ట. మంజుల ఇరవయ్యోశతాబ్దపు ఉత్తరార్థంలో పుట్టి పెరుగుతున్న పిల్ల. ఇది ఏవిషయమైనా పట్టు పట్టింది అంటే దాని అంతు తేల్చేవరకూ ఆగదు.

రవీంద్రుడు ఒకచోట అన్నట్లు - కథ చెప్పాలి అంటే 'అనగా అనగా ఒకరాజు - అంటూ ప్రారంభిస్తే ఈకాలంపిల్లలు వినరు. 'ఏమిరాజు? ఏదేశానికి ఆయనరాజు? ఏమిటి ఆయనపేరు'...పరంపరగా ఆచిన్ని హృదయాలలోనుంచి ఇలా ప్రశ్నలు బయలుదేరుతవి.

మంజుల నిస్సందేహంగా ఈకోవలోని పిల్లే. దానికి ఏదో తీర్చరాని సందేహం వచ్చి ఉంటుంది. ఏస్కూలునుంచి వస్తూనో, ఏఆటలమధ్యనో - దానికి ఇలాటిసమస్యలూ, సందేహాలూ ఉత్పన్నంకావటం మామూలే - తక్షణం విజృంభించిన వాయువేగంలాగ - రివ్వుమని దూసుకువచ్చి ఇంట్లో ఎవరినో ఒకరిని జలగలా పట్టుకోవటమూ - దానికి పరిపాటే.

ఈసంగతి నాకు బాగా తెలిసినా, ఇంతటి సుమనోజ్ఞమైన సాయంత్రం - తొమ్మిదేళ్ల ఒక ఆడపిల్ల రూపంధరించిన బ్రహ్మరాక్షసికి ధారపోయటం ఏమంత తెలివైనపని కాదనిపించింది. కళ్లు గట్టిగా మూసుకుని లోకంలోని బధిరత్వమంతా కూడా ఆక్షణాన నాకు సంక్రమించినట్టు నటించాను.

మంజుల మరొక అడుగు ఎక్కువే చదివింది. ఇరవయ్యోశతాబ్దం ఉత్తరార్థంలో పడుతూనే పుట్టిందాయెను! మెల్లగా ఒళ్లోనుంచి లేచి ప్రక్కనవచ్చి నా చెవిలో నోరుపెట్టి 'ఓపిన్నీ! ఓపిన్నీ! ఓ...' అంటూ ఆకాశం చిల్లులు పడేటట్లు తారస్థాయిలో రంకె పెట్టింది.

నేను సంచితంచేసుకున్న బధిరత్వమంతా ఒక్కక్షణంలో - 'మంజుల'రవంతోపాటూ ఆకాశపథానికి ఎగిరిపోవటమూ - లోపల తల దువ్వుకుంటున్న పెద్దక్క 'ఏమిటది మంజూ'?...అంటూ గాభరాగా వరండాలోకి రావటమూ ఒక్కసారే జరిగాయి.

'చూడమ్మా పిన్ని పలకటంలేదు'...తల్లి ముందు నన్ను నేరస్తురాలిగాచేసి నిలబెట్టింది మంజుల.

'ఊఁ...అపరకాళికాదేవి-ఏమిటికథ!' ...అన్నాను పుస్తకం దిగులుగా మూసివేసి.

'మరీ... 'ప్రవాసాంధ్రులు' అంటే ఏమిటే?...గబ్బున తిరిగివచ్చి మళ్లా ఒళ్లో వాలి అడిగింది మంజుల.

నాకు ఆశ్చర్యం వేసింది. దీనికి ఇంతపెద్ద మాట ఎట్లా పట్టుపడింది? ఏదైనా కథల పుస్తకంలోకాని, క్రొత్తగా కొనుక్కున్న ఆరవతరగతి తెలుగువాచకంలోకాని చదివి ఉంటుందా?

ఒక్కక్షణం నిమీలితనేత్రాలతో ఆలోచించాను. 'ప్రవాసము' అంటే పరదేశవాసము, లేక పరదేశగమనము-అని నిఘంటుకారుడి భాష్యం.

'ప్రవాసాంధ్రులు' అంటే పరదేశాలలో ఉంటూఉన్న, నివాసం చేస్తూఉన్న మన ఆంధ్రులు - అంటే తెలుగువాళ్ళనుకో అమ్మాయీ!'...అని తేటతెల్లంగా చెప్పాను.

'పరదేశం' అంటే యేమిటే పిన్నీ! ... మంజుల సూటిగా రెండవ బాణం వదిలింది.

దీనికి జవాబుచెప్పటంకష్టం. న్యాయంగా పరదేశం అంటే మనదేశం కాని ఇతరదేశం అని అర్థం చెప్పుకోవచ్చును. బ్రిటన్, అమెరికా, రష్యా, మలయా - ఇంకా ఎన్నో! కాని ఈ అరంకాని అర్థాలు ఎన్నో ఈ 'పరదేశం' అనేపదానికి మనవాళ్ళు అన్వయించటం నేనుఎరుగుదును. పుట్టినఊరుదాటి మరొకటి ఎరుగని వానికి ఎప్పుడైనా కొద్ది దూరంలో ఉన్న బస్తీకి వెళ్లటం తటస్థిస్తే - అది వానికి పరదేశంతో సమానంగా ఉంటుంది. చిన్నతనంనుంచి మన భాషా

### సరళ సలహా!

క్రితంవారం విజయనగరంనుంచి ఒక సోదరి లోగడ ఆడవారు కొంత అభిమానం త్యాగంచేసి లొంగితే అదివారికి విజయమేనని నేను చెప్పినమాట అక్షరాలా తన అనుభవంలో నిజమయిందని జాబు వ్రాశారు.

కొన్నికొన్ని మాటలు అనుభవంలో కాలక్రమేణా తెలుస్తాయితప్ప చెప్పగానే అర్థమైపోవు. అందుకు ఆమె జాబు ఒకనిదర్శనంగా తీసుకోవచ్చు.

కుమారీ శతకంలో చెప్పినమాటలు కేవలం చాదస్తంగా ఈ కాలంవాళ్లకు తోచటం సహజం. ఏమాటఅయినా అనుభవ పురస్సరం గనక అయితే అన్ని కాలాలకూ వర్తిస్తుంది. ఎటొచ్చీ మనం అన్వయించుకోవడంలోనే ఉంటుంది చిక్కంతా.

'స్మిత పూర్వా భాషీచ పూర్వభాషీచ రాఘవః' అని శ్రీరాముని వాల్మీకి వర్ణించాడు. అది ఆడవాళ్లకు పూర్తిగా వర్తిస్తుంది. అలా వర్తించడంలో ఆడవారిసౌందర్యమంతా ఉంది. ఇలాగే స్త్రీ పురుషులకు సమానంగా వర్తించే (వర్తించవలసిన) మధురప్రకృతులు ఎన్నోవున్నాయి.




# ★ జననీ జన్మభూమిశ్చ... ★

సంప్రదాయాలూ, మన తెలుగు తనమూ - మాత్రమే ఎరిగినవారు హఠాత్తుగా రాష్ట్రం దాటి ఏ బెంగాల్ ప్రాంతానికో, ఏ ఉత్తర ప్రదేశ్ కో వెళ్ళటం సంభవిస్తే - అది వారికి దేశం కాని దేశంలో అడుగు పెట్టినట్లుం టుంది.

ఇదంతా విన్న మంజుల ముచ్చటగా మూడో బాణం వదిలింది.

'సరే... మనం ఎరిగిన ప్రవాసాంధ్రులు ఎవరైనా ఉన్నారా?'

'లేకేం, ఉన్నారు. ఉత్పత్తి అర్థం చెప్ప కోవాలంటే బొంబాయిలోనూ, కలకత్తా లోనూ - ఆ మాట కొస్తే ఢిల్లీలోనూ కూడా మన కుటుంబానికి స్నేహపాత్రులైన వారూ, దూరపు బంధువులూ ఉన్నారు. వాళ్ళను నీవు బాగా ఎరగవు. ఇక - అసలు అర్థం చెప్పుకో వాలంటే... ప్రస్తుతం ఎవరూ లేరు కాని - మన ఇంటికి అప్పుడప్పుడూ వస్తుంటే - మన ప్రక్క వీధిలోని శారదమ్మగారు... వాళ్ళు నిన్న మొన్నటి దాకా ప్రవాసాంధ్రులే ...అన్నాను తిరిగి పుస్తకం అందుకుంటూ,

'అయితే వాళ్ళు ఏదేశంలో ఉండి వచ్చారు పిన్నీ?'...అన్నది మంజుల క్షణం ఆలోచించి. 'అమెరికా'...ఈ మాట అంటూ పెద్దక్క వంక చూచి నవ్వాను. ఆమె కూడా నావంక చూచి చిన్నగా నవ్వింది ఆ నవ్వు నాలో ఏవో జ్ఞాపకాలను మళ్ళా ఒక్కసారి స్మృతికి తీసుకు వచ్చినది.

'అబ్బ, అమెరికానే!...ఎంత అదృష్టం! మనం కూడా ప్రవాసాంధ్రులం ఎప్పుడు అవుతామో!...మంజుల కళ్ళు పెద్దవి చేసి ఆలోచిస్తూ, నా వళ్ళో నుంచి లేచి వెళ్ళి పోయింది,

నా మనసులో మెదిలిన జ్ఞాపకాలు నన్ను మళ్ళా పుస్తకం తెరవనీయలేదు. ఆ జ్ఞాపకాలు అమెరికా వెళ్ళి వచ్చిన శారదను గురించినవి.

శారద పెద్దక్కకంటె చిన్నదీ, నాకంటే పెద్దదీను. నాకు ఏడెనిమిది ఏళ్ళు వచ్చిన దగ్గరనుండి శారద మా యింటికీ, మేము వాళ్ళ యింటికీ వస్తూ పోతూ ఉండటము ఎరుగుదును. స్కూలుకు వెళితే మేమందరం ఒక గుంపుగా బయలుదేరి వెళ్ళేవాళ్ళం.

శారద వాళ్ళ కుటుంబానికి కులదీపకురాలు ఒక్కతే కావటంచేత మాకంటే బాగా గారాబంగా పెరిగింది. సాధారణంగా పిల్లలలో అతిగారాబం కలిగించే దుష్ఫలితాలు- శారదలో కూడా ముద్రలు వేసుకున్నవని చెప్పక తప్పదు. ప్రపంచంలోని అందరు పిల్లలూ ఒక ఎత్తూ, తనొక ఎత్తూ అనీ, తాను కుందేలికి మూడే కాళ్ళు - అని అంటే అవి తప్పని సరిగా మూడే కాళ్ళు ఉండిఉండాలనీ ఆ పిల్ల భావంగా ఉండి ఉండేది.

అన్నిటినీ మించి శారద గొప్ప డాంబికురాలు. విన్నది ఎంతటి విచిత్ర విషయమయినా అమాయికంగా విశ్వసించే చిన్నతనము నాది. అరేబియన్ నైట్సు కథలనూ, కాశీ మజిలీ కథలనూ మించిన అద్భుతాలను- తననూ, తనకుటుంబానికి అన్వయించి - తమాషా కథలను చెపుతూ ఉండేది. శారద రోజూ ఇట్లా ఘనమైన విచిత్రాలు చెపుతూ, మమ్మల్ని కొండెగొట్టి వేసేది.

క్రమంగా అందరమూ బాల్యదశ ఒదిలి పెద్దవాళ్ళ మయినాము. శారద కూడా హైస్కూలు చదువుతో నే విద్యకు స్వస్తివాక్యం పలికింది. అయినా కూడా మా రాకపోకలు స్నేహబాంధవ్యాలు - యథాప్రకారం సాగిపోతూనే ఉన్నవి. శారద చెప్పే డంబాలు- మునుపటివలె మరీ పసికబుర్లుగా ఉండక పోయినా - ఇప్పుడు కూడా మమ్మల్ని గగన వీధుల్లో విహారం చేయిస్తూ ఉండేవి.

పెద్దక్కకు వివాహమైన రెండేళ్ళకు శారద కూడా గృహస్థ జీవితంలో అడుగు పెట్టింది. ఏరి కోరి తెచ్చిన శారదభర్త యోగ్యుడు, రూపసిన్నీ. అతను ఇంజనీరింగ్ ప్యాసై బొంబాయిలో ఏదో ఇన్‌స్టిట్యూట్ లో ఒక సంవత్సరం తరిఫీదు పొందుతున్నాడు.

ఈ సంవత్సరం ట్రెయినింగు పూర్తి అయేలోపల శారద బొంబాయి వెళ్ళటానికి ఎంత తహతహపడిందో వ్రాయటం కష్టం. ఆమాటకొస్తే శారద పరిస్థితిలో ఉండిన యెవరమైనా బొంబాయి వెళ్ళటానికి అంత కాంక్షతోనూ ఎదురు చూస్తూ ఉండి ఉందురు. ఆరోజులలో బొంబాయి అంటే మాకు ఊహకు అందరాని ఏదో స్వర్గలోకంగా ఉండేది. ఆంధ్ర దేశంలో నాలుగయిదు చిన్న ఊళ్ళు మాత్రం ఎరిగిన మాకు శారద త్వరలో బొంబాయివెళ్ళిఅక్కడ కాపురం చేయబోతున్నది అంటే అది ఎంతో అపురూపమైన సంగతిగా తోచేది. శారదవంటి అదృష్ట వంతురాలు మరొకరు ఉండరనీ మా భావంగా ఉండేది.

శారద బొంబాయి వెళ్ళే రోజులు దగ్గరకు వస్తున్న కొద్దీ-ఈ మా భావన శారదలో

[illegible] ప్రతిబింబించ సాగింది. తను పుట్టి పెరిగిన పూరూ, వాడా, స్నేహితులూ [illegible] వెళ్ళబోయే బొంబాయి ముందు—[illegible] ఆరంభించబోయే క్రొత్త జీవితం ముందు—ఎందుకూ కొరగాని విషయాలుగా [illegible] తోచసాగినవి. ఇది విచిత్రమూ [illegible] కాదని మాకు తెలిసినా—శారద [illegible] క్రొత్తగా ధరించిన రూపు మాకు ఉడుకు [illegible]నంగా ఉండేది.

శారద నోములు ఫలించి ఒక శుభదినాన శారదభర్త ట్రెయినింగ్ పూర్తి అయి—అక్కడే ఉద్యోగం కూడా అయింది, శారద బొంబాయి వెళ్ళిపోయే తరుణంలో—చిన్ననాటి స్నేహితురాలు మమ్మల్ని విడిచిపోతున్నదనే కొంత విచారమూ మాకు అందుబాటులో లేని బొంబాయి నగరానికి వెళ్ళగలుగుతున్నదనే కొంత అసూయా—నిండిన హృదయాలతో ఆమెకు వీడ్కోలు ఇచ్చి పంపాము.

క్రొత్తలో శారద ఎలా ఉన్నదో ఏమి వింతలూ, వినోదాలూ చూస్తూ ఉన్నదో, అనుభవాలలో ఏమి నూతనత్వాలు అలవరచుకున్నదో తరుచు ఇలా ఉండేవి మా ఆలోచనలు. కాని కాలచక్రం క్రమంగా 'శారద బొంబాయి వెళ్ళటం' అనే అద్భుతవిషయాన్ని రంగులు తగ్గించి మా హృదయాలలో [illegible] విషయంగా శోభింపజేయసాగింది. కాని అప్పుడప్పుడు వచ్చే శారద ఉత్తరాలు మాత్రం ఆ కరిగిపోతున్న రంగుల్ని తిరిగి పంచవన్నెలుగా మార్చి మా మనోనేత్రం ముందు పరిచి పెట్టేవి. అవి బొంబాయి నగరమూ—అందులో తను చిత్ర విచిత్రానుభూతుల్ని గురించినవి. అవి ఎంతవరకు యథార్థాలో, ఎంతవరకు అతిశయోక్తులో మాకు ఆరోజులలో అర్థమయేవి కావు.

సుమారు పదినెలలు గడిచాక శారద మా ఊరు వచ్చిందని తెలిసింది. శారద ఎలా ఉంటుందో! బొంబాయి జీవితమూ, మనుషులూ అలవాటయిన శారదకు మేము ఉత్త పల్లెటూరి ముఖాలుగా కనిపించమని ఎక్కడ [illegible]ంది! ఇలా వంద సందేహాలతో మమ్మల్ని మేము కించపరచుకుంటూ శారదను చూడటానికి వాళ్ళ యింటికి వెళ్ళాము.

శారద రూపురేఖలలో నిస్సందేహంగా మార్పు వచ్చింది. మనిషిలో ఇదివరకు లేని [illegible]దనం వచ్చింది. రెండు జడలు [illegible]లుగా వేసుకుని బొంబాయి ఫ్యాషను [illegible] చీర కట్టుకుంది. చెవులకు క్రొత్త రకం దుద్దులు—రింగుల వంటివి మెరుస్తున్నాయి. బొంబాయి నీళ్ళు వాతావరణమూ కాగా వంటికి పట్టినట్లు ముఖంలో ఒక విధమైన నునుపూ, మెరుపూ కనపిస్తున్నాయి.

ఈ క్రొత్తశారద మమ్మల్ని సంతోషంగానే ఆహ్వానించి పలకరించింది. బొంబాయినగరంలో తనజీవితమూ, అక్కడి

# అనూరాధ డైరీ

ఇవాళ పొద్దుట్నించి బద్ధకంగా ఉంది. ముసురుపట్టి మూడురోజులుగా ముసర. ఈ వానల్లో ఏపనీ సాగక మందకొడిగా ఉంటుంది.

అన్నట్లు ఇవాళే నాగల్లు వదినగారు [illegible] పోర్ట్నించి వచ్చేరు. సాయంకాలం బండికి వస్తామని రాశారు. ఆఫీసు వదిలే టైమేగనక అటునుంచి స్టేషన్ కెళ్లి అక్కగారిని తీసుకురావచ్చు.

* * *

ఆయన ఒకో తరహా మనిషి-ఏ ధోరణి పడితే అదే ధోరణి. ఉత్త పసిపిల్లల మనస్తత్వం! ఇంట్లో ఉన్నంతసేపూ అనూ అనూ ...... అంటూ ఆఫీసుకెడితే [illegible] గొడవ. ఇల్లేమయిందో ఇంట్లో వాళ్ళేమయ్యారో వెనక చింత ఉండదు.

ఈమధ్య వదినగారు రాసింది. వాళ్ళింట్లో కూడా అదే యిదే తంతుట! నాకప్పుడప్పుడు అనిపిస్తుంటుంది - దాదాపు 'మగవాళ్ళంతా యింతే' అని. పాపం నెలకొ వస్తోంది సరూ జాబు రాసి-దాని కింతవరకు జవాబివ్వటానికి తీరిక చిక్కలేదు. చేతులు నిండా పనిలేదు—చేసే ఉద్యోగమూ లేదు. అయితే నేం తీరికాలేదు. ఈ అసవాళ్ళంతా యింతే అనుకుంటారు. ఎవరేనా వింటే [illegible]!

* * *

వదినగారొచ్చారు. వచ్చినందుకు చాలా సంతోషం. అయితే అంతా నాలాంటి వాళ్ళే ఉంటారా. వచ్చినవాళ్ళు అందరూ వచ్చినట్లు ఉండరు.

కాకపోతే గడపలో కాలుపెట్టింది గగ్గు నుంచీ ఏవిటి అముక్తపరిమాటలూ, మూతి విరుపులూను. ఆడబిడ్డననే ఆధిక్యం అడిన [illegible] నెగటంలోనే చూపించింది. చూడగానే ఒక్కసారి కుశలప్రశ్నగా చిరునవ్వు నవ్వింది. చీకట్లో అగ్గిపుల్ల వెలిగించి ఆర్పేటట్టు నవ్విందావిడ. ఆ నవ్వు ఏదో శోధించినట్టుంది. మొహాన టార్చిలైటు వేసినట్టుంది. నేను మమూలుగానే ఉన్నాను. ఏం తియ్యగా-(పెద్దికదా)-అమ్మలాగా నవ్వరాదూ!

'అదేవిటో నీకింకా [illegible]' ఇలా ఆవిడ వేసే ప్రశ్నలకు ఏం సమాధానం చెప్పను?

అసలు నేననుకుంటాను-భగవంతుడు ప్రశ్న వేయటానికి వీల్లేని సమాధానలతో బాటు, కొన్ని సమాధానాలు లేని ప్రశ్నలు కూడా తయారుచేసి మనమీద పడేశాడూ అని.

కాకపోతే నేను ఆవిడ ప్రశ్నలకు ఏం సమాధానం చెప్పను! ఆ ప్రశ్న అడిగితే ఎవరిముట్టుకు వాళ్ళకు తెలుస్తుంది కడుపుపండని అమ్మని 'బిడ్డలింకెప్పుడు పుట్టారమ్మా-పుణ్యకాలం వెళ్ళిపోతుందేమో' అని యీసడించే అమలక్కలకు ఈవిడ వేలు విడవని సోదరీమణి మన్యాటికిని.

* * *

ఆడబిడ్డను ఆదరించవలసిన బాధ్యత ఆ యింటికోడలునైన నాకు లేదేకా తెలుసు.

కాని వదిన వంటివాళ్ళకు ఏం తెలిసీ ఏం లాభం లేదు.

ఆవిడ పూర్తిగా పాతకాలం మనిషి. ఆ మాట అంటే ఆవిడకు కోపంవస్తుంది. ఈ మాట ఇలా వ్రాయటం చూస్తే షిఫాన్ చీర కట్టి మరీ ఈజీచైర్ లో కూర్చుని పేపర్ చదువుతుంది.

ఇందులో ఆవిడ పాతకాలందికాదు. కాని మనస్తత్వంలో ఆవిడ అంతే - ఎప్పుడూ యింతే.

భర్త అంటే యజమానిట. భార్య దాసీట. అయితే అల్సేషియన్ 'టామీ'లా తోకాడిస్తూ తిరగ్గలమా? ఇహనింకేం—ఆవిడ ఆయన అక్కగారు కావడంతో అధికారం ఆవిడకు ఒక రేకు ఎక్కువ. అన్న మాట. ఓసారి... (మొన్న కూడా) అనిసే అందిలెండి. 'ఆడబిడ్డ అర్ధమగడూ' అని, నాకు ఈవిడతరవాత 'అర్ధ' కాదు 'అసలు మగడే' అనిపిస్తుంది. అసలు మగడే నయం-అధికారం చెలాయించినాటిక అంతం' అని కూడా అనిపిస్తుంది.

మాటే బాట మాటలున్నాయే-వాటి వాడి. వేడీ, అందరికీ చూచాయగా తెలిసినా అనుభవించినవాళ్ళకు అందులో భారతాలూ భాగోతాలూ తెలుసు, నాకూ అంతే-చాల నాకే ఒక్కోసారి అనిపిస్తుంది.

ఈనాడు పెళ్ళికాని ఆడపిల్లలు 'స్త్రీ స్వాతంత్ర్యం' 'సమానత్వం' గూర్చి ఉపన్యాసాలూ, వ్యాసాలూ యివ్వడంకన్నా. ఈ ఆడబిడ్డలనుంచి, వదరు అదరు పుట్టించే దురాక్రమణదారులనుంచి ప్రత్యేక రక్షణల కల్పించే హామీలు- ఎవరిస్తారో (ప్రభుత్వమైనా సరే) ఆ యిచ్చేది వ్రాతమూలకంగా మరీ తీసుకుని వారి కుటుంబ జీవితం ప్రశాంతంగా మనశ్శాంతితో గడిచే ఏర్పాటుచేసుకోవాలి. అది తెలివైనపని. అప్పుడు స్వాతంత్ర్యం. సమానత్వం రెండూ వచ్చినట్లే సంతోషించవచ్చు! ★

# జననీ జన్మభూమిశ్చ...

వాటికి సమాధానాలు చెప్పింది. కాని ఆవింతలలో, విశేషాలలో—తాను ఆశ్చర్యానందాలు పొంది పాలుపంచుకుంటున్నట్లు లేదు శారద ధోరణి. అవి తను బుద్ధి తెలిసిన దగ్గరనుండీ ఎరిగిన సామాన్య విషయాలుగా అవి తెలుసుకోవలసిన మూర్ఖులం మేమయినట్లుగా శారద మాటలలో ముఖవిన్యాసాలలో మాకు విస్పష్టంగా తోచసాగింది.

కొంతసేపు జరిగినాక శారద హఠాత్తుగా లేచి 'చల్లగాలికి కొంతసేపు డాబా పైకి వెళ్దామా? రోజూ సాయంత్రాలు మెరీన్ డ్రైవ్‌కో, జూహూ బీచ్‌కో, మలబార్ హిల్స్‌కో వెళ్ళటం అలవాటు. ఈ సన్యాసి వూళ్ళో కాలక్షేపానికి ఏమీ లేవు కదా! మీరంతా ఎలా గడుపుతున్నారో బాబూ!' అంటూ మెట్లమీదికి దారి తీసింది.

జూహూ బీచీ, మెరీన్ డ్రైవూ, మలబార్ హిల్సూ—ఏమిటో—అవి ఎంతెంత దూరాన ఉన్నాయో మాకు తెలియదు. ఇలా రోజూ ఈ విహారప్రదేశాలకు షికారు వెళ్ళటమనేది సామాన్య సంసారులకు ఎంతవరకూ సాధ్యమైన విషయమో అసలే తెలియదు. ఇవన్నీ చూచి అనుభవించగలిగిన శారద అదృష్టానికీ—ఏమీ ఎరుగని మా దురదృష్టాన్నీ నిందించుకుంటూ శారదను అనుసరించాము.

సగం వరకూ ఎక్కి శారద కాళ్ళు పట్టుకుని 'అబ్బ. కాళ్ళు లాగుతున్నాయి. అక్కడ అంతా ఎలివేటర్లే. మేడమెట్లు ఎక్కడంకూడా అలవాటు తప్పిపోయింది. మనవాళ్ళకు ఇలాటి ఆధునిక సదుపాయాలేవీ పెట్టుకోవటం తెలియదు' అన్నది.

ఎలివేటర్లు ఎలా ఉంటాయో, వాటి ఉపయోగమేమిటో మాకు ఏవీ అప్పుడు తెలియకపోయినా, శారద మాటలు వింటూవుంటే—నిజంగా మనవాళ్ళు ఉట్టి అసమర్థులు అనిపించసాగింది. కాని బొంబాయి వంటి నగరాల్లో అందులోనూ 'స్కై స్క్రేపర్లు' అనబడే భవంతులకుండే ఎలివేటర్లు—పాతిక మెట్లున్న డాబా యిళ్ళకుకూడా ఉపయోగించుకోవచ్చునని మా అప్పటి భావన తలుచుకుంటే—ఇప్పుడు మాత్రం నవ్వువస్తుంది.

కొంతసేపు పిచ్చాపాటి మాట్లాడాక శారద దగ్గర శెలవు పుచ్చుకుని ఇంటికి వచ్చాము. తర్వాత వారంరోజులకు శారద మళ్ళా బొంబాయి వెళ్ళిపోయింది.

తర్వాత మాకు అయిదారునెలలవరకూ శారదనుంచి ఉత్తరాలు కాని, అక్కడి కబుర్లు కాని తెలియలేదు. ఏ వైవిధ్యమూ లేని నిత్యజీవితపు వేగంలో శారద స్మృతి మా మనస్సులలో మళ్ళా కొంత మసకగించిందనే చెప్పవచ్చు.

ఉన్నట్లుండి ఒకనాడు మాకు కబురు తెలిసింది. శారద భర్తను వాళ్ళ ఆఫీసు తరఫున ఒక సంవత్సరం ట్రెయినింగుకు అమెరికా పంపుతున్నారనీ, శారదకూడా భర్తతో విదేశానికి వెళ్ళబోతున్నదనీ; ఆతర్వాత కొద్దిరోజులకే శారదా భర్తా బొంబాయినుండి నేరుగా అమెరికాకు బయలుదేరి వెళ్ళారని కూడా తెలిసింది.

అదివరకే శారద సౌభాగ్యానికి కించిత్ అసూయాగ్రస్తులమైఉన్న మమ్మల్ని ఆమెయీ క్రొత్త అదృష్టం మరీ కించపరచింది. ఉన్నట్లుండి శారద పర్వతాగ్రాన్ని ఆరోహించినట్లూ మేము పర్వతం మొదటి మెట్టువద్దనే నిలవబడివున్నట్లూ మాకు అనిపించసాగింది. ఆంధ్రదేశంలోని ఒకటి రెండు సామాన్యం బస్తీలుతప్ప ఎరుగమాయెను!

శారద అమెరికాలోవున్న సంవత్సర కాలమూ—మాకు ఆమెదగ్గరనుంచి ఉత్తరాలు లేవు. అమెరికావంటి ఘనమైన విదేశంలో అక్కడి జీవితపు మహావేగంలో, శారదకు మారుమూలలోని చిన్ననాటి స్నేహితులం మేము గుర్తువుంటామని అనుకోవటంకూడా పొరపాటే అనిపించింది. అసలు ఈ సంవత్సరకాలంలోనూ శారద నిత్యజీవితమూ, ప్రకృతీ ఏవిధంగా ఎంతవరకు మారివుంటాయనేది, మా ఊహలకు అందని విషయంగానే ఉండిపోయింది.

సరిగ్గా సంవత్సరంపైన మరొక నెల తిరిగేసరికి శారద, భర్తతోకూడా తిరిగి స్వదేశానికి వచ్చి బొంబాయి చేరిందని తెలిసింది. మేమింకా శారదను ఎప్పటికి చూడగలమా అని సందేహంలో కొట్టుమిట్టాడుతూ వుండగానే శారద భర్తను ఈ ఊరిలోనే వున్న వారి ఆఫీసు బ్రాంచికి మేనేజరుగా వేయటమూ దంపతులిద్దరూ ఈ ఊరికి బయలుదేరి రావటమూ కూడా వరుసగా జరిగాయి.

ఉద్యోగమయితే బాగా పెద్దదే. కాని వుండవలసిన ఊరుమాత్రం శారద దృష్టిలో ఎందుకూ కొరగాని ప్రదేశం. ఈ పరిస్థితిలో—అమెరికా, బొంబాయిలనుండి ఇటీవలనే తిరిగివచ్చిన శారద—ఈ ఊరికి. వాతావరణానికి, మళ్ళా ఎలా అలవాటుపడి సమన్వయం చేసుకోగలదా అని మా అందరికీ సందేహం వచ్చినమాట నిజం.

వచ్చిన క్రొత్తలో ఈ సమన్వయం కుదుర్చుకోవటానికి శారద పెద్దప్రయత్నమే చేయవలసివచ్చింది. అమెరికావంటి విదేశంలో సంవత్సరం కాలం గడిపివచ్చిన శారదకు, ఈ ఊరూ ప్రాంతమూ, ఈ ఊరు తప్ప మరొకటి ఎరుగని మేమూ ఒట్టి ఎనికిమాలినవాళ్ళుగానూ, పల్లెటూరి ముఖాలుగానూ కనిపించటం అసహజంకాదేమో అనుకుంటాను. పర్వతాగ్రంపై నిలుచుండి వచ్చిన వానికి, నేలపై ప్రాకులాడుతుండిన వానిపై కల చిన్నచూపే శారదకూ మాపైన కలిగింది. పైగా మహానగరాలలో లభ్యమయ్యే వసతులూ, వినోదాలూ అలవాటుపడిన శారదకు ఇక్కడ జీవితం చాలా విసుగుదలగా తోచింది. దీనివల్ల ఇతరులకు అంత హానిలేకపోయినా—ఆమె నిత్యజీవితంలో ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ, తృప్తినీ లోపింపజేసింది.

కాని మానవుడు పరిస్థితులకు ఒక్క

# పాకశాల:
# కాయకూరలతో పిండివంటలు

## గుమ్మడి పూరీలు

కావలసిన సామానులు:

1/4 వీశె గోధుమపిండి.
మంచిగుమ్మడి ½ చెక్క.

ఇది తీపి పిండివంట.

చేయువిధము: 10 తులముల నెయ్యి. 1/4 వీశె పంచదార. గుమ్మడిఅంటే మంచి గుమ్మడికాయ సగముచెక్క, గింజలు, పైన చెక్కు తీసివేసి గట్టిగనుండు దానిని ఉడక పెట్టి నీటిని ఒకప్లేటుగిన్నెలోకి వాడనిచ్చి 10 తు॥ల నేతిని ఒకగిన్నెలోపోసి వడగట్టిన గుమ్మడిముద్దనువేసి కమ్మటివాసన వచ్చువరకు వేయించి దింపవలెను. తరువాత 1/4 వీశె గోధుమపిండిని చిటికెడు ఉప్పువేసి మెత్తగా కలుపవలెను. పూరీల పిండివలె కలుపవలెను. 1/4 వీశె పంచదారలో కొంచెము గుమ్మడి ఉడికించి వడకట్టిననీటినిపోసి (తీగపాకం) పాకం వచ్చువరకు ఉంచి పాకంరాగానే గుమ్మడిముద్ద వేయించినది వేసి అడుగుఅంటకుండా కలుపవలెను. గటి పాకంరాగానే దింపి గోధుమపిండి పూరీ క్రిందవత్తి ఆపూరీలో ఈ ముద్దపెట్టి పైన యింకొకపూరీ వేసి చుట్టుగట్టిగానొక్కి అట్ల పెనం బాగా కాలినతర్వాత ఈ పూరీవేసి కాల్చితీయవలెను. ఇది చాలరుచిగానుండును.

## పొట్లకాయ చిప్స్

కావలసిన సామానులు:

5 పలముల బంగాళదుంపలు.
1 పొట్లకాయ.
1/4 వీశె గోధుమపిండి.

ఇది కారపు పిండివంట.

### కౌశాంబి సత్యవతీదేవి

చేయువిధము: 5 ఫలముల బంగాళ దుంపలు, చిటికెడుఉప్పువేసి మెత్తగా ఉడికించి తోలుఒలిచి కొద్దిగా కారము, చిటికెడు పసుపుగుండ కొద్దిగా ఉప్పువేసి రోటిలో మెత్తగా రుబ్బవలెను. తరువాత ఒకపొట్లకాయ ఒక అంగుళం పొడవున గుండ్రముగా కోసి లోపలగింజలు తీసివేసి ఉడికించిన బంగాళదుంపముద్దను పొదిపి ఉంచవలెను. తరువాత గోధుమపిండిని కొద్దిగా ఉప్పువేసి నీళ్లుపోసి పెరుగువలె చిక్కగాకలుపవలెను. పొయ్యిమీద బాణలిపెట్టి నూనెగాని డాల్డాగానిపోసి బాగా మరిగినతరువాత గోధుమపిండిలో పొట్లకాయ ముక్కలు (బంగాళదుంపముద్ద పెట్టినవి) ముంచి నూనెలోవేసి వేయించి తీయవలెను. ఇది వేగినతరువాత తినుటకు పైన గోధుమపిండి దానిలోపల పొట్లకాయ. దానిలోపల ఉర్లగడ్డముద్ద ఉండి చాలరుచిగానుండును. ఇది కూడ రెండు మూడు రోజులు నిల్వయుండును.

## బొంబాయిరవ్వతో కొన్ని.
## పైనాపిల్ కేకు

కావలసిన సామానులు:

1/4 వీశె బొంబాయిరవ్వ.
1/4 వీశె శనగపిండి.
1/4 వీశె నెయ్యి.
½ చెక్క కొబ్బరికురిడీ.
2 ఫలముల జీడిపప్పు. 1 వీశె పంచదార.

చేయువిధము: 1/4 వీశె బొంబాయిరవ్వ 1/4 వీశె శనగపిండి నెయ్యిలేకుండా వేరుగా కమ్మని వాసనవచ్చువరకు వేయించవలెను. ½ చెక్క కొబ్బరికురిడీ కోరిన తరువాత బొంబాయిరవ్వలోవేసి మెత్తగా రోటిలో పోసి దంపవలెను. తర్వాత వేయించిన శనగపిండి, సన్నగాతరిగిన 2 ఫలముల జీడిపప్పు కొద్దిగా ఏలకుపొడివేసి బాగుగా కలుపవలెను. 1 వీశె పంచదార ముదురుపాకంపట్టి దానిలో దంచిన పొడివేసి 1/4 వీశె నెయ్యి పోసి పైనాపిల్ ఎసన్సుపోసి క్రిందకుదింపి ఒకపళ్ళెములోపోసి మనకు కావలసిన రీతిని ముక్కలుగా కోయవలెను. ఇది చాల రుచిగానుండును. 8, 10 రోజులదాకా నిలవయుండును.

## రవ్వ, శనగపిండి కలిపిన జిలేబీ

కావలసిన సామానులు:

1/8 వీశె బొంబాయిరవ్వ.
8 తు॥ల శనగపిండి
4 తు॥ల బియ్యపుపిండి.
8 తు॥ల నెయ్యి. ½ వీశె చక్కెర.

చేయువిధము: 1/8 వీశె బొంబాయిరవ్వ, 8 తు. శనగపిండి, 4 తు. బియ్యంపిండి, 8 తు. నెయ్యి ఈ నాలుగింటిని ఒకకళాయి పాత్రలో తీగసాగినరీతిగా కలిపి ఒకరాత్రి యుంచవలెను. మరునాడు ½ వీశె చక్కెర ఒక కళాయిపాత్రలోపోసి కొద్దిగా నీరుపోసి పొయ్యిమీదపెట్టి లేతపాకము రాగానే దింపవలెను. తరువాత పొయ్యిమీద బాణలి పెట్టి నెయ్యిపోసి బాగా మరిగినతర్వాత ఒకకొబ్బరిచిప్ప చిల్లిఉన్నది తీసుకుని కలిపి యుంచిన పిండినిపోసి జంతికలవలె త్రిప్పి వేగినతరువాతతీసి పాకంపట్టిన పంచదారలో వేసి తీయవలెను. ఇది చాలసులభము, చాల రుచిగాకూడ యుండును. కావలసినవారు పంచదార పాకములో రోజ్ కలర్ వేసుకుంటే జిలేబీరోజ్ కలర్ లోయుండి చాలఅందముగా యుండును. ★

---

విషంగా భావిస. పరిసరాలకు, నీతిగతులకు—అర్థం చేసుకోగల మనోబలిమి అతడికి చాలా తక్కువే ఉంటుంది. అందులోనూ మానవుడు ముఖ్యంగా సంఘజీవి. తన చుట్టుప్రక్కల వారికంటె తానెంత అధికుడైనా కొంతమంది వారితో కలసి మెలసి మెలగక తప్పదు. అలాగే శారదలోని ఈ రెచ్చిపెట్టుకున్న అహంభావం, ఆధిక్యభావాన్ని కాలమూ, పరిసరాలూ కూడా లొంగదీశాయి. ఈ మార్పుకు చాలాకాలం పట్టలేదనికాదు కాని ఇప్పుడు మాత్రం శారద నిస్సందేహంగా మామూలు శారద అయింది.

ఎప్పుడైనా అమెరికాను గురించీ, అక్కడి జీవనవిధానాలగురించీ—కుతూహలంగా, ఆశ్చర్యంగా—మేము అడుగుతున్నప్పుడు, శారద వాటికి సమాధానాలు చెపుతూనే 'ఊఁ...పోనిద్దూ, అమెరికా ఎంత డబ్బుతో తులతూగే ఘనమైనదేశమైనా, మాతృదేశంతో సమానం అవుతుందా ఏమిటి?'...అంటుంది. శారద అలా అంటున్నప్పుడు ఎందుకో మా హృదయాలు పులకరించి కన్నులు చెమర్చటంకద్దు.

ఈ కథ యావత్తూ వ్రాసేకాలంలో నా మనో నేత్రంముందు మెదిలి దీర్ఘంగా నిల్చి నిస్తుంటే, మంజుల చివాలున పరిగెత్తి వచ్చి నా చిరకొంగులో తల దాచుకొన్నది. 'మళ్లా ఏమి వచ్చింది పిల్లా...?' అన్నాను నవ్వుతూ. 'మరేం...శారదమ్మగారి ఇంటికి వెళ్లి వారు నిజంగా ప్రవాసాంధ్రులయ్యారా అని అడిగితేను పిన్నీ!' అన్నది ముఖం పైకెత్తి.

శారదమ్మగారు ఏమి అన్నదని అడిగాను కుతూహలంగా.

'ఒకప్పుడు ప్రవాసాంధ్రులేనట. ఎంత ప్రవాసాంధ్రులైనా, ఎప్పటికైనా స్వదేశానికి తిరిగి రావాలె అనీ, ఏ దేశమూ మాతృదేశంకన్న గొప్పదికాదనీ అన్నది...' మంజుల ఈ మాటలు చెప్పి ఎట్లా వచ్చిందో అట్లాగే మళ్లీ ఒక్క పరుగుతో వెళ్లిపోయింది.

తొలకరిజల్లు వెలిసింది. జల్లు వెలిసిన తర్వాత ప్రశాంతత వలెనే నా మనస్సు విశ్రాంతమైనది. 'జననీ జన్మభూమిశ్చ—స్వర్గాదపి గరీయసీ'...అని సన్నగా కూని రాగం తీసుకుంటూ, చేతిలో పుస్తకం తృప్తిగా మూసివేసి ఈజీచైరులోనుంచి లేచాను. ★

ప్రత్యేక త్రిగుణచర్యతో

గూడియున్న మెక్లీన్స్

పెరాక్సయిడ్ టూత్‌పేస్టు



1

✻ చాలా బాగుగా శుభ్రపరచును!

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'రైసాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే–మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



2

✻ చాలా బాగుగా తెలుపుజేయును!

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన మరకలను, గారపట్టిన రంగును తొలగించును–అందువల్ల వాటిని మెరిసే టట్లు తెల్లగా చేయును.




3

✻ బాగుగా కాపాడును!

మీరు మెక్లీన్స్‌ను వ్యయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని ఆస్వాదనమును కనుగొనండి. ఇది చిగుళ్లను ఉత్తేజపరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును.

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంత మైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

MTY-46

# ★ ఉషా పరిణయం ★

(13-వ పేజీ తరువాయి)

ప్రవేశించాను. జయ, అత్త అక్కడనే వున్నారు! ఉష మంచంపై కూర్చుని వుంది. వాతావరణం మాత్రం ప్రశాంతంగా వున్నట్టేమీ గోచరించలేదు. వారి వదనాలు కళావిహీనమై వున్నాయి. నేను లోనికి ప్రవేశించడం గమనించి కూడా ఎవ్వరూ పలుకరించలేదు. ఉష మాత్రం లేచి నిలబడింది.

"నమస్తే" అన్నాను. జవాబులేదు. ఉష ముఖం ప్రక్కకు తిప్పుకుంది. జయ నన్ను మరొక గదిలోకి తీసికెళ్ళింది. ఉష పెండ్లి వార్త చెప్పింది. అన్నీ నిశ్చయమయిపోయినవట. పెండ్లి మరొక వారంరోజులలో జరుగబోతుందట. "దయచేసి అసలే వికలమై వున్న ఉష మనసును మీరు ఏ విధంగా కూడా నొప్పించవలద"ని ప్రాధేయపడుతున్న జయను చూసి 'అలాగే" అని బయటకు వచ్చాను. నా వెనుక జయ వచ్చింది. నా కళ్ళు తిరిగిపోతున్నాయి. నేను కనిన కలలు కలలులాగే వుండి పోబోతున్నాయి. నేను ప్రేమించిన ఉష, నన్ను అర్పణచేసుకున్న మూర్తి నా కనులముందే పరాయిదయిపోతుంది. వస్తూ వస్తూ ఉషను చూశాను. ఆమె ముఖం కనిపించనీయలేదు. అడుగు ముందుకు వేయలేకపోయాను. చర్చిలో గంటలు వినిపించాయి. "చూడండి ఉషా. ఆ గంటల సాక్షి నేను ఎన్నటికీ మీవాడినే" అంటూ గబగబా బయటకు వచ్చేశాను.

జయ చెప్పిన వారం రోజులలోను అప్పుడే నాలుగురోజులు అయిపోయాయి. బ్రతుకు నిస్సారము అయినట్లుగా వుంది. ఉషను మరచిపోవాలి. కాని ఎలా? అది నాకు సాధ్యమా? గుండె బరువెక్కుతూ వుంది. మనసు వికలమయిపోయింది. రేడియో ట్యూన్ చేశాను. "నీ యాసా అడియాసా చేయిజారె మణిపూసా" అని పాడింది రేడియో. నా ఆనందానికి తోడ్పడే ప్రతి వస్తువు కూడా ఇప్పుడు నన్ను పరిహసిస్తున్నట్లు తోచింది. అక్కడ కూర్చొన బుద్ధి పుట్టలేదు.

బజారుకు బయలుదేరాను. మిత్రుడు కనిపించి బలవంతాన పిక్చరుకు తీసికెళ్ళాడు. ఆశ్చర్యం! ఉష వచ్చింది పిక్చరుకు. ప్రక్కన ఎవరో ఉన్నారు బంధువులులాగుంది. జయకు ఇచ్చిన మాట మరచిపోయాను. ఆమెకు నొప్పికలిగించే విధంగా ప్రవర్తించాలనుకున్నాను. నాలోని ప్రతి అణువు ప్రతీకారవాంఛతో భుగభుగ మండిపోతుంది. సూటిపోటి మాటలతో ఆమె హృదయాన్ని గాయపరచాను. ఆమె వల వలా విలపిస్తూంటే నా హృదయం కొంత వరకు తేలికపడింది. సినీమాలోని ఘటనలను చూసి కన్నీరు విడుస్తుందని ప్రక్కన కూర్చున్నవారు భావించారు. పైగా "పిచ్చి పిల్ల" అని ఒక రిమార్కు కూడ పాస్ చేశారు. కాని వారికేం తెలుసు ఆమె గుండెలలోని బాధ.

"ఏమండీ నా ముఖం చూస్తుంటే ఇప్పుడు డోకు వస్తుందా" అన్నాను నెమ్మదిగా ఆమె కుర్చీవైపు, ముందుకు వంగి. ఆమె చేతిగుడ్డ తడిసిపోయింది గాబోలు పైట చెంగుతో కళ్లు వత్తుకుంది.

ఇంటర్‌వెల్ అయింది లైట్లు వెలిగాయి. ఆమెను చూడాలనిపించింది. బయటకు వచ్చి గేటుదగ్గర నిలబడి చూశాను. ఆమె కండ్లు ఎఱ్ఱబెక్కాయి. పసిడి వన్నె వదనం కందిపోయింది. ముంగురులు చెదిరాయి. ముఖం వాడిపోయింది. అప్పుడుగాని తెలిసిరాలేదు నేను చేసిన పని. నాలోని రాక్షసత్వం అప్పుడు బోధపడింది నాకు. సిగ్గుతో కుంచించుకుపోయాను. ధైర్యంచేసి ఆమెను చూసే సాహసం ఇక నా కెక్కడిది? ఇంత నీచత్వానికి పాల్పడ్డ నామీద నాకే అసహ్యం వేసింది. కాని అన్నీ జరిగిపోయాయి. ఇప్పుడు అనుకుని చేసేదేముంది. క్షమించమని వేడుకునే అర్హతకూడా ఇప్పుడు నాకు లేదు. అవకాశముండి ఏకాంతంగా కన్పిస్తే తప్పక క్షమించగలదు. ఆ ధైర్యం వుంది నాకు.

ఇక పిక్చరు చూసే బుద్ధిపుట్టలేదు. మిత్రుడు వారిస్తున్నా వినకుండా వచ్చివేశాను. రూముకు వచ్చానన్నమాటేగాని ఆ గది నా పాలిటికి ఒక నరకకూపంలా గోచరించింది. ఇక లాభంలేదు. ఒక్కసారయినా అక్కను చూసివస్తే ప్రాణానికి కొంత వూరట కలుగుతుంది.

ఆ రాత్రే బయలుదేరి అక్కగారి వూరు వెళ్ళాను. ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించింది అక్క. ఏకోదరులం కాకపోయినా అంతకన్నా మిన్నగా చూసుకుంటుంది నన్ను.

అక్క ఆమధ్య వ్రాసిన ఉత్తరానికి సమాధానం ఇవ్వలేదు నేను. అందుకు అక్క, "నా ఇష్టమే తన ఇష్టమని భావించి వుంటాడు" అనుకుని సంబంధం నిశ్చయించిందట. నా కొఱకు మనిషిని కబురు పెడదామనుకుందట. ఇంతలోకే నేనే వెళ్ళానక్కడికి. కాని అక్కకు ఈ వివాహం వద్దని ఎలా చెప్పను? ఎలా చెప్పగలను? నామీద నమ్మకంతో వారికి మాట ఇచ్చింది. అంతేగాదు తాంబూలాలుకూడ పుచ్చుకున్నారట. వివాహంకు మరొక 4 రోజులు మాత్రమే వుంది వ్యవధి.

"తమ్ముడూ, పిల్లను చూసుకుంటావా ఏర్పాటు చేస్తాను" అంది అవసరంలేదన్నాను కనిపించబోయే ముఖంలో ఉషను చూసి దుఃఖించడం ఇష్టంలేక. నా ఉష నాదు కాకుండా పోయాక ఇక ఎవరయితేనేం. అక్క తృప్తికొఱకుగాని, ఈ నా జరుగబోయే వివాహం, లేకుంటే మరి దేనికి. పెండ్లిరోజు వచ్చింది.

పిల్లల కోలాహలానికి, మేళతాళాల, బాజాభజంత్రీల రణగొణధ్వనికి అంతులేదు. పెళ్ళి తతంగం అంతా యథాప్రకారం జరిగిపోతోంది. నిర్వికారంగా చూస్తూ కూర్చున్నాను. పెండ్లికూతురు వచ్చింది. పెండ్లి

# ★ ఉషా పరిణయం ★

పీటలపై కూర్చోబెట్టారు. మంత్రాలు చెప్పారు. తాళి కట్టమని చేతికిచ్చారు. కట్ట బోయాను. గుడిగంటలు వినిపించాయి దూరాన. అంతే. ఆగిపోయాను. "తమ్ముడూ త్వరగా కానివ్వు" అక్క హెచ్చరిక విని గుండె దిటవు చేసికొని మూడు ముళ్లు వేశాను. అక్క సంతోషంగా నా వంక చూసింది.



నా కండ్లనుండి రెండు నీటి బింగువులు రాలాయి. 'తమ్ముడూ" అంటూ వీపు తట్టింది అక్క. పాపం ఆమె కేం తెలుసు అవి రక్తాశ్రువులని. ఆనందబాష్పాలని భ్రమించింది.

శోభనంగది నరకంలా ఉంది ... కాని పెళ్ళికి అలా ఎవరైనా చేస్తారా? బహుశా నా దృష్టికి అలాతోచి ఉండాలి...అక్కడ వున్న ప్రతివస్తువూ నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నది. అక్కడ వున్న పచ్చరట, ఆపిల్ పండ్లు ఉషను మరువనీయకుండా చేస్తున్నాయ్.

బయట గొళ్లెం పెటిన చప్పుడయింది. పెండ్లికూతురు లోనకు "నెట్ట" బడింది గాబోలు. ఏమిటీ వైపరీత్యం పెద్దల కృత్యాలు న్యాయం, చట్టం అనే ముసుగు తెరలను కప్పుకుని వీళ్ళు చేసే రాక్షసకృత్యాలకు అంతం ఎప్పుడోగదా! ముక్కు, మొఖం తెలియని ఒక స్త్రీని అంతకంటే ఏమీ ఎరుగని ఒక పురుషుని సాన్నిధ్యంలోకి నెట్టి, ఒక బాంధవ్యం కలిపించి తరువాత వారి మానాన్ని వారిని వదిలివేస్తారు. ఇది లోకం పోకడ. దీనికి అంతం?

"ఆమె" అక్కడే తలుపు దగ్గర నిలబడి వుంది బలి పీఠానికి గొనిపోయిన మేకపిల్లలే బెదిరిపోతోందో లేక ఎరుగని మాచిన మధురక్షణాలు సమీపిస్తున్నవని ఎంచి సంతోషంతో సతమవుతున్నదో ఆ భగవంతునికే తెలియాలి. కాని పాపం ఆమె కేం తెలుసు తను ఒక మనసులేని మగవాడికి మనువని. ఆమెకు సుఖం రాసి పెట లేదు. అంతేమరి ... అయ్యో ఏమిటి నా పిచ్చి. లోకంలో అంతా ప్రేమించే పెండ్లిచేసుకుంటున్నారా? మనకోరం చావక ఉషను మరువలేక పోవచ్చు. కాని తన ఆశలన్నింటిని నాపై ఉంచుకున్న ఈమెకు అన్యాయం చేయడం నాకు న్యాయమా? జీవితంలో ఇంతవరకు ఏ ఒక్క ఘనకార్యం చేసిఎరుగను కాని తెలిసి ద్రోహం చేయడంకంటే మరోపాపం వేరే వుంటుందా

ఆమె అలాగే ఇంకా అక్కడే నిల్చుని వుంది. సిగ్గు కాబోలు. అందులో కూడ మంచి అందం వుందంటారు కవులు. లేక నేను వెళ్ళి బుజ్జగించి లాలనగా పలుకరించి తీసికెళ్లాలని ఆమె అభిప్రాయమేమో. కాని ఆమె కేం తెలుసు నేను పడుతున్న బాధ. ఆమెకు తెలియకుండటమే మేలు.

అప్రయత్నంగా లేచాను. ముందుకు నడిచి ఆమె దగ్గరకు వెళ్లాను. కాళ్ళు తడబడుతున్నాయ్. గుండె అతివేగంగా కొట్టుకుంటున్నది. ఆమె ముగ్ధసుకుమారసౌందర్యాన్ని తిలకించే ధైర్యం నాలో ఏకోశానాలేదు ఆమె దగ్గరగా వెళ్ళి నిలబడ్డాను. ఎలా సంబోధించాలో అర్థం కావటంలేదు. కాని తప్పదు. తప్పక ఆమెను సంతోషపెట్టాలి; అది నా విధి.

ఆమె తలవంచుకుని గోడవైపు తిరిగి నిలబడి వుంది. చెక్కిళ్లపై నీటి చారలను తుడుచుకుంది అతి ప్రయత్నంమీద. ఎందుకో ఆ కన్నీరు అర్థం కాలేదు నాకు.

"చూడు..." మొదలెట్టబోయేసరికి గుడిగంటలు వినిపించాయ్. హృదయం గతుక్కుమన్నది. హే భగవాన్ నాపై ఇంకా కనికరంలేదా.

"ఏనాడు వుగా ఆ గుడి గంటలన్నని. కొద్దిరోజుల క్రితమే చర్చి గంటల సాక్షిగా నన్ను ఒక మనసును నా సర్వస్వంగా అర్పించుకున్నాను. కాని నేడు ఇలా జరుగుతుందని ఆనాడు నే మిరువురమూ తలంచలేదు. అది నా జీవితంలో మరువరాని సంఘటన. నా హృదయంలో ఆమెకున్న స్థానం..." నా గొంతు బొంగురుపోయినట్లయింది. మాట పెగిలిరాలేదు. కన్నీరు నదిప్రవాహంలా సాగిపోతోంది.

ఆమెలో చలనం కలిగిందిలాగుంది. నెమ్మదిగా ఓరకంటితో మాచింది. అంతే. నా వక్షస్థలంపై వాలిపోయింది "మీరా" అంటూ. అప్పుడు మరల ఈ లోకంలోకి వచ్చాను.

ఏమి టీ వింతప్రవర్తన. కాని ఆనాటి అనుభూతిని పొందగలిగాను. ధైర్యం చేసి నెమ్మదిగా ఆమె మోము పైకెత్తి మాశాను అంతే ... "కలయో వైష్ణవమాయయో" అన్న పద్యపాదం జ్ఞప్తికువచ్చింది. భగవంతుడా! ఎంతటి పరీక్ష పెట్టావయ్యా! ఎంతటి లీల చేశావయ్యా! అయినా వివాదాలు మహనీయా ఇంత ఆనందంగా కూడా అక్కను మరువగలనా? ★

# లంకె బిందెలు

బొమ్మల కథ

9



పద్మశ్రీవారి "శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం"లో పద్మావతీ శ్రీనివాసుల కల్యాణం.

# వార్తావరణం

సంఘీభవ ప్రొడక్షన్స్ వారి పౌరాణిక చిత్రం 'శబరి' పదిరీళ్లు తయారైంది. ముఖ్యపాత్రను పండరీబాయ్ నిర్వహిస్తోంది. రామునిగా హరనాథ్, లక్ష్మణుడుగా రామకృష్ణ (మనోరమ) నటిస్తున్నారు. ఎల్. విజయలక్ష్మి, మీనాకుమారి, లక్ష్మీకరణం, రాజశ్రీ, రమాదేవి, నాగయ్య, చదలవాడ, పద్మనాభం, అల్లు రామలింగయ్య, కొడపాటి, మోహనదాసు, ఎ. వి. సుబ్బారావు సీనియర్, జూనియర్, ఎం. వి. ఎస్. ఆచార్య మొదలైనవారు పాల్గొంటున్నారు. శోభనబాబు అనే మరొక నటుడిని పరిచయంచేస్తున్నారు. ఇందులో ఆర్. నాగేశ్వరరావు ఒక పాత్ర నిర్వహించారు.

కథ, మాటలు పద్మరాజు, పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, పద్మరాజు వ్రాస్తున్నారు, సంగీత రచయిత పెండ్యాల. ఈ చిత్రానికి చిత్రపు నారాయణమూర్తి దర్శకుడు, బి. ఆర్. నాయుడు నిర్మాత. మార్చిలో విడుదల కాగలదని తెలుస్తోంది.

* * * *

అడయారు అన్నామలై నగర్ లో అంజలీదేవి. (వాక్యం అర్థమైనసినిమాసంభాషణలా కనబడాలని కృషి చేసినా పొగడు) నాగేశ్వరరావు, వేదాంతం రాఘవయ్య భవనాలు నిర్మించుకొంటున్నారు. మూడు ఇళ్ళకూ స్థలాలు పక్క పక్కగా ఉన్నాయి. నాగేశ్వరరావు ఇళ్ళస్థలం సుమారు 11 గ్రౌండ్లు. పచ్చిక తివాచీకి, పూలతోటకు విశాలమైన చోటు వదలి, భవనం నిర్మిస్తున్నారు. మేడ మీద డాబా చిన్నతోట ఉంటుంది. చంద్రవంక ఆకారంలో కనిపించే భవనం, ముందువేపు పచ్చిక బయలుపై చిన్న కుటీరం కూడా వేస్తారట.

దీనికి ఆనుకుని ఉన్న 16 గ్రౌండ్ల స్థలంలో అంజలీదేవి పెద్ద భవనం నిర్మిస్తోంది. భవనం నిర్మిస్తున్నం భారీ ఎత్తునా ఆవరణను మనోహరంగా అలంకరించడానికి అంజలీదేవి, ఆదినారాయణరావు పథకాలు తెప్పించి పరిశీలిస్తున్నారు. రాఘవయ్యగారు ఇంకా నిర్మాణం ఆరంభించలేదు.

"అంతా బాగుంది గాని. పిల్లాడా, నువ్విక్కడ కారుకి గరాజ్ వేయిస్తే ఎలా? గాలి ధారాళంగా రాదూ?" అంది అంజలీదేవి ఒకనాడు ఇంటి స్థలందగ్గరకు వచ్చినప్పుడు. వాళ్ళింటికీ వీళ్ళింటికీ గరాజ్ లు ఒకదానికొకటి ఆనుకొని ఉన్నాయి.

"ఎనిమిదివేపులనుండి గాలి మా ఇంటికొచ్చి సేవచేయడానికి సిద్ధంగా ఈ గరాజ్ కొద్దిగా అడ్డు తగిలితే నుకేం ఫరవాలేదు... కాపోయినా నువ్వు సినిమా హీరోయినవు గారూ. ఎన్ని ఆటంకాలున్నా, తప్పించుకొచ్చేస్తుందిలే" అన్నారు నాగేశ్వరరావు నవ్వుతూ.

"మా తాతకి సినిమాలలోమీ పేర్లు ఇక్కడ మీ యిద్దరూ పక్క పక్కనే రాయి" అని ఛలోక్తి విసిరారు భవననిర్మాణంలో పాల్గొంటున్న ఒకాయన.

నాగేశ్వరరావు భవననిర్మాణం మూడు నెలలలో పూర్తికావచ్చు. అంజలి భవనం అంతకుముందే అయిపోవచ్చు.

## నాటకోత్సవాలు

ఆంధ్ర నాటక కళాపరిషత్తు (గుడివాడ) వారి 21 వ వార్షిక సభలు జనవరి 20 నుండి 23 వరకు తెనాలిలో జరగబోతున్నాయి. ఈ సందర్భంగా నాటక ప్రదర్శన పోటీ ఏర్పాటు చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ నుండి ఇతర ప్రాంతాలనుండి 80 నాటక సమాజాలు పాల్గొంటాయనీ, మొత్తం 52 నాటకాలు 49 నటికలూ ప్రదర్శిస్తారనీ నిర్వాహకులు తెలియజేస్తున్నారు.

మహాసభలకు ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్, మైసూరు గవర్నరు శ్రీ జయచామరాజ ఉడయార్ ప్రభృతులు రాగలరని తెలుస్తోంది.

# క్రిస్మస్ కథ

(11-వ పేజీ తరువాయి)

... ఇగ్నేషియస్ లయోలా ...లో ప్రాముఖ్యం వహించాడు. పోప్ భగవంతుడు ఎన్నిక చేసిన ప్రతినిధి అని చాటే 'సొసైటీ ఆఫ్ జీసస్' ఉద్యమాన్ని ఆరుగురు శిష్యులతో, తాను ఇంచుమించు సేనానిగా నిలచి నడిపాడాయన. ప్రొటెస్టెంట్ మతాన్ని ఉన్నచోట్ల ప్రతిఘటించడంతోపాటు ఇండియా, జపాన్, చైనా ప్రభృతి దూరదేశాలలో కాథలిక్ వ్యవస్థలను నెలకొల్పాడాయన. మనదేశం వచ్చిన సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్, లయోలా బృందంలో ఒకడు.

16 వ శతాబ్దంలో ఒక ఉత్పాతం వచ్చి పడింది. దేశ పాలకులు, క్రైస్తవ దేశపాలకులు [illegible] కలగులు అయిపోయారు. ఇంగ్లాండు రాజు ఎనిమిదవ హెన్రీ, క్రైస్తవ పీఠానికి కూడా తానే అధిపతినన్నాడు. తరవాత రెండు వందల ఏళ్లపాటు యూరప్ అంతటా అధికారంకోసం [illegible] ప్రయత్నాలూ, వాదాలూ, జరిగాయి. చర్చి, ప్రభుత్వం రెండుచేతులవంటి వన్నారు. మతసంస్థల నిర్వహణలో ప్రవేశించుంటే తప్ప దేశపాలనకు అర్థం లేదన్న వాదం కూడా వచ్చింది.

అప్పట్లోనే, అమెరికా ఈ విషయమై ఒక పెద్ద నిర్ణయం చేసుకొంది. కాంగ్రెసు (ప్రజాప్రతినిధిసభ) మత సంస్థలపై ఎట్టి [illegible]యాలూ చేయరాదు అంటూ రాజ్యాంగాన్ని సవరించుకుంది.

* * *

ఈనాడు క్రైస్తవ మతంలోని కాథలిక్, బాప్టిస్ట్, మెతడిస్ట్, లూథరన్, ప్రెస్బిటేరియన్, ఎపిస్కొపలియన్ మొదలైన శాఖోపశాఖల ఆరాధనాచారవ్యవహారాలు సిద్ధాంతాలు పరిశీలిస్తే, (ప్రొటెస్టెంట్ శాఖలో ఉపశాఖలు అసంఖ్యాకంగా ఉన్నాయి-) ఇవన్నీ [illegible] చెలువను పుట్టి పెరిగినవేనా అనిపిస్తుంది.

అయినా, ఎన్నెన్ని భేదాలున్నా ఒకటి మాత్రం సత్యం. పూజారులగురించిన పేచీలు ఎలా ఉన్నా భగవంతుడు ఒక్కడే నన్నది. [illegible] విశ్వసించే మతం. ఆయన సర్వేశ్వరుడనీ, విశ్వాసంతో ఆరాధిస్తే అనుగ్రహిస్తాడని అందరూ నమ్ముతారు.

క్రిస్ట్-మాస్ సమయంలో భగవంతుడు స్వయంగా ఆలయంలో నిలచిఉన్నాడను కొని కొందరు వందనంచేస్తే, ఎదురుగా ఉన్న ఆచార్యుడు భగవంతుడు ఏసుద్వారా ప్రపంచించిన పవిత్రవాక్కును తమకు వినిపిస్తున్నాడని కొందరు పరవశులవుతారు.

అందరూ డిసెంబరు 24న, ఏసునాథుని స్మరిస్తారు. మానవకోటి చేసిన కోటి పాపాలకు తానే శిక్ష వహించిన మహాపురుషునకే నమస్కరిస్తారు. తమను ఉద్ధరించడానికి వచ్చినవాడిని తామే అజ్ఞానంతో హింసించి వధించామని గ్రహించి పశ్చాత్తప్తులవుతారు.

ఆయన దివినుండి భువికి దిగివచ్చి తరింప చేసినందుకు ఆనందంతో కృతజ్ఞతతో పండుగ చేసుకొంటారు. ఉపవసిస్తారు. తరవాత విందులు చేసుకొంటారు. ఒకరి కొకరు కానుకలు ఇచ్చుకొంటారు. శుభాకాంక్షలు తెలియచేసుకొంటారు. ఈ కార్యక్రమమే క్రీస్తు అవతరించిన పవిత్రస్థలంలో జరుగుతుంది. అనేక దేశాలనుండి, అనేక భాషల వారు పుణ్యక్షేత్రం [illegible] కాబట్టి అక్కడ మతాచార్యులు అన్ని భాషలూ మాట్లాడుతారు. క్రిస్మస్ రోజు అర్ధరాత్రి ప్రార్థనలు జరుగుతాయి. తరవాత 'గుడ్ ఫ్రైడే' పశ్చాత్తాప దినం.

సిలువ వేసేముందు, జీసస్ తన సిలువను తానే మోసుకుంటూ, నడుస్తూ లేస్తూ హింస భరిస్తూ నడచిన వీధి-వయా డొలొరోసా-లో ఆనాటివారి పాపానికి చింతిస్తూ పశ్చాత్తాపం చెందుతూ భక్తులు సిలువ మోసుకొని ఊరేగింపు జరుపుతారు. జీసస్ నడువలేక ఆగిపోయిన ప్రతిచోటా ఒక ప్రత్యేక ప్రార్థనలు చేస్తారు. అన్నిశాఖల వారూ ఇందులో పాల్గొంటారు. సిలువ వేసినచోట చేరినమీదట, సిలువమీది జీసస్ విగ్రహాన్ని ధావళవస్త్రంలో ఉంచి, ఆయన భక్తుడు జోసెఫ్ అనాడు ఆయనను సమాధి చేసినచోటుకు తీసుకువెళ్తారు. అక్కడ తిరిగి ప్రార్థనలు జరుపుతారు.

తామే చేతులారా హింసించి వధించిన వాడు దైవమే అని తెలిసి, పశ్చాత్తాపమే పూజాద్రవ్యంగా ఆయనకు అర్పించే ఈ మహామతంలో, అన్ని ఉపశాఖలవారూ, ఆచారభేదాలవారూ, ఈ దివ్యక్షణంలో లోకేశ్వరుడిని ఏకకంఠంతో స్తుతిస్తారు.

—'ఏసుదాసు'



# పుస్తకసమీక్ష

## విశ్వనాథనాయుడు

[గేయకావ్యం: రచన: పి. నారాయణ రెడ్డి, ప్రాప్తిస్థానం ఆంధ్ర బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాదు, వెల: రెండు రూపాయిలు, పేజీలు 87.]

విశ్వనాథనాయుడు కథావస్తువు చారిత్రికము. యీకథకు కొన్ని కొత్త సొబగులుదిద్ది కర్త శ్రీ సి. నారాయణరెడ్డి ఈ కావ్యమును మాత్రాఛందస్సులో రచించినారు. ఇది ఆరుఖండముల లఘుకావ్యము.

ఇది శృంగారస్పర్శ లేకుండా నారాయణరెడ్డి వ్రాసిన తొలికావ్యము ధర్మ, వీరములిందు సరసంగా పోషింపబడినాయి. కాగా వెనుకటికన్న కొన్నికొన్ని పట్టులలో శ్రీ రెడ్డి గొప్ప పరిణతిని సాధించినారు. అంత్యప్రాసలపై కేవలము దృష్టి నిలుపక బృహత్కథ నొకదానిని ఆసాంతము చెప్పబూని శ్రీ రెడ్డిగారు వక్తవ్యము ధారాళముగా సాగించినారనక తప్పదు.

ఇందు విశ్వనాథుడు తన ప్రభుభక్తి, ధర్మదీక్షకు తార్కాణముగా కన్నతండ్రిని సైతం బందీనిచేసె. రాయల కప్పగించిన ధర్మమూర్తి – ఈ కథాకథనంలో విభిన్న ఆదర్శాలమధ్య సంఘర్షణను చక్కగా తీర్చిదిద్దారు రెడ్డిగారు. కాగ ప్రతిఖండం తొలిభాగంలో సుందర ఫ్ఛబితంగా చేసిన ప్రకృతివర్ణనలు కడురమ్యంగా హృద్యంగా ఉన్నాయి. ‘ఒక శ్రీవ చేతనునివికృతి హాలకు బాహ్యరూపమో యన్నట్లు వ్యాపించెను తమస్సు’ ఇలాంటి వర్ణనలు కొల్లగా ఉన్నాయి. ఉల్బణత ప్రయుక్తులు వంటి పదాలు నారాయణరెడ్డి వంటివారు సైతం ప్రయోగించడంవల్ల రేపటి సాహితీ నందనంలో కవితాలతికలిటువంటి వ్రతులు ఇంకెన్ని వేస్తాయో అనే భయం కలగడం సహజం.

శ్రీ రెడ్డిగారు స్వాదుత్వంతో బాటు, చదివిన తర్వాత కూడా నిమగు ప్రాగల్భ్యం మిగిలే మరింత పటిష్ఠమైన ఫణితులలో కథలు కావ్యాలుగా అర్చిదిద్దాలని ఆశిస్తున్నాము.

—శుభశ్రీ.

* * *

## ఐన్‌స్టైయిన్

ఇంగ్లీషులో రాసిందికేతరీన్ ఓవెన్స్ పియర్. తెలుగు అనువాదం: చిల్లంకొండ రాఘవరావు. పేజీలు: 219 వెల రు 3-00 ప్రచురణ: దక్షిణ భాషా పుస్తకసంస్థ సహకారమున గుండి మెడాస్, ఏలూరు.

మనతోబాటు మొన్న మొన్నటివరకు జీవించిన మహామేధావి ఐన్‌స్టీన్ జీవితాన్ని గురించి తెలియపరుస్తుంది. న్యూటన్, కోపెర్నికస్ మొదలకు మహావ్యక్తులను గురించి మనంఎరగం కొని వారినిగురించి చదువుతాం. వాళ్ళసిద్ధాంతాలను తెలుసుకుంటాం. ఇక మనతో వున్న ప్రఖ్యాత వేత్తయొక్క జీవితచరిత్ర తెలుసుకోకపోతె మనకే సిగ్గుచేటు—ఈ కొరతొచ్చే పుండటానికి ఆస్కారంలేదు.

ఐన్‌స్టీన్ నిత్యజీవితం చదువుతూ వుంటే మహాత్ముడు జ్ఞాపకానికి వస్తాడు. ఐన్‌స్టయిన్‌కు అతను గొప్పవాడని అతనికే తెలియదు, తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. మూడవ తరగతిలోనే ప్రయాణం చేస్తూ వుండేవాడు రైల్లో. 1921 లో న్యూయార్కు రేవుకు చేరుకున్నప్పుడు పత్రికా విలేఖరులకు ఆయన్ను చూడగానే ఎలాగా కలసికొని మాట్లాడటం అని గాబరాపడ్డాయి. మంచి గుడ్డలు వేసుకోవాలనే వూహే వుండేది కాదు. మాసినా, చిరిగినా అందుబాటులో వున్న దుస్తులను ధరించి అకాడమీకి వెళ్ళేవాడు.

ఆ రోజుల్లో కూడా ఆయనకు పేరు రాకుండా చేయడానికి ఎన్నో నీచోపాయాలకు దిగారు గిట్టనివారు. ఎంతసేపూ ప్రజాక్షేమం తప్ప తనక్షేమాన్ని గమనించేవాడు కాదు. ఈ విశాలప్రపంచంలో ప్రతియేటా మనిషి పేరుప్రతిష్ఠలతో వైకుంఠమౌతున్నాడంటే ఓర్వలేనివారుంటున్నారని మనకు బోధపడుతుంది. ఆయనలో జ్ఞాపకం పెట్టుకోవలసిన గుణం – నిజాయితీ శాంతిస్థాపన ముఖ్యాంశము అని తెలుసుకొనేందుకు నానాగజ్యసమితినుండి రాజీనామా చేయడమే.

అనువాదం చాలా సరళంగా సులభమైన భాషలో వుంది. కాలేజీ క్లాసులకు పఠనీయగ్రంథంగా పెట్టి తద్వారా విద్యార్థులకు ఈ మహనీయుని జీవితం తెలియజెప్ప వచ్చును.

రా. మూ

# అదీ ఇదీ

## ఇంకా కర్నూలే

ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదు అని పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికింతవరకూ తెలీదు! ఆంధ్ర శాసన సభ్యులకు ఉద్దేశించిన ఉత్తరాలను పంపేటప్పుడు ప. బెంగాల్ ప్రభుత్వం ఇంకా మాజీరాజధాని కర్నూలు అడ్రెస్‌కే పంపిస్తోంది.

అసలు ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన సంగతైనా తెలిసింది, నయమే!

* * *

## నిజాంపై కేసు

800 మంది స్త్రీలు, 100 మంది పురుషులు, ఎందరో బాలురు, బాలికలు నిజాం అధీనంలో బానిసలుగా ఉన్నారని, వీరిపై నిజాంకు అంతులేని అధికారం ఉందని, వీరిని కొనుకలుగానో, బలాత్కారంగానో నిజాం తెచ్చుకొన్నాడని ఆరోపిస్తూ 1954 ఏప్రిల్ 27 న శ్రీ బి. సి. కేస్కార్ అనే అడ్వొకేట్ హైదరాబాదు జిల్లా మేజిస్ట్రేట్‌కు “సమాచారం” అందజేశారు. మేజిస్ట్రేట్ దర్యాప్తు జరగాలని ఆజ్ఞాపించగా, నిజాం హైకోర్టుకు అప్పీలు చేశాడు. అప్పుడు నిజాం రాజ్‌ప్రముఖ్‌గా ఉంటున్నందున ఆయనపై విచారణ జరపడానికి వీల్లేదని హైకోర్టు ఉత్తర్వు చేసింది. శ్రీ కేస్కార్ సుప్రీంకోర్టుకు అప్పీలు చేశారు. ఇప్పుడు నిజాం రాజప్రముఖ్ కాదుగనుక విచారణ జరుపవచ్చునని సుప్రీంకోర్టు హైదరాబాదు జిల్లా మేజిస్ట్రేట్‌కు కేసు పంపించింది.

* * *

## కోడలిపై మామ హక్కు

కొడుకు పోయాడు కోడలు మైనరు. ఆమెను మామగారు ఎత్తుకుపోయి, డబ్బుకోసం ఆమెకిష్టంలేని పెళ్ళి మళ్ళీ చేశాడు. మురాదాబాద్ జిల్లాలో ఒక గ్రామమునుండి ఈ అభియోగం ఒకరు తేగా, క్రిందికోర్టు మామకు 4 ఏళ్ళ కఠిన శిక్ష విధించింది. అలహాబాదు హైకోర్టుకు అప్పీలు చేయగా, వారు నిర్దోషిని విడుదల చేశారు. కారణం: హిందూలా ప్రకారం మైనరు స్త్రీకి వివాహం కాగానే భర్తే గార్డియన్ అవుతాడు. భర్త పోతే, భర్త దగ్గరి బంధువులే గార్డియనులవుతారు గాని పిల్ల తల్లిదండ్రులకు ఎలాంటి హక్కులూ లేవు. పిల్లకు మళ్ళీ పెళ్ళి చేయడం లేదంటే, అది మామూలుగా ప్రతి పిల్ల కొత్తవాడితో కాపురం చేయాల్సినట్టేనని అనుకొన్నప్పుడు పడేపాట్లే తప్ప మరేం కాదు. ఆ అమ్మాయి ఇప్పుడు బాగానే ఉందనటానికి, కొత్త భర్తతో సుఖంగానే ఉందనటానికి ఆధారం ఉంది. ఇదీ కోర్టువారి తీర్పు సారాంశం. ★

క్రీడారంగం

## ఢిల్లీ టెస్ట్ సమీక్ష

...రబడి రాయబారాలు జరిపిన తరు... మనదేశానికి క్రికెట్ ఆటగాళ్ళ... న్ని పంపడానికి ఆస్ట్రేలియా అధి... సమ్మతించారు. అయితే ఒక్క... విధించారు–తమవారు కేవలం 'టెస్టు' ...మాత్రమే పాల్గొంటారని. ప్రతిసా... రి రెండు ఇతర పోటీలలో కూడా ...నికి ఆస్ట్రేలియావారు అంగీక...

...మా బృందం రావడం మూ... సందేహ మేమీ లేదు. వారి ...కేశంలో ఆటస్థాయి పెరగడానికి ...స్తుంది. వారి శక్తిసామర్థ్యాలు ...నమూ కలుగజేయగలవు.

...కవిధంగా ఆస్ట్రేలియా విధించిన ...న గౌరవప్రదమైన దేమీకాదు. ...లియాను నిందించి ప్రయోజ...

...స్తాన్‌ను 2-0 స్కోరుతో టెస్టులలో ...స్ట్రేలియా ఆటగాళ్ళు మనదేశంలో ...ర. ఢిల్లీలో జరిగిన మొదటి ...రతజట్టును ఒక ఇన్నింగ్సు 127 పరుగుల తేడాతో అవలీలగా ఓడించారు.

మన ఆటగాళ్ళు ఇప్పట్లో ఆస్ట్రేలియాను ఓడించడం అసంభవం కావచ్చు. ఇటీవల ఇంగ్లండును కూడా అతిసులభంగా ఓడించిన ఆస్ట్రేలియా ప్రపంచంలో మొదటి స్థానం తనదిగా చేసుకొన్నది. కాని మూడవ టెస్టులో పాకిస్తాన్ జట్టువలె కనీసం ఆస్ట్రేలియాతో సమఉజ్జీ అయినా మనకు కొంత ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఇటీవలి ఇంగ్లండు పర్యటన ఫలితంగా కలిగిన అవమాన భారం కొంతమట్టుకు అయినా ఉపశమించవచ్చు.



రిచి బేనాడ్
ఆస్ట్రేలియా కాప్టన్. ప్రపంచంలోకెల్లా అగ్రగణ్యులైన 'ఆల్ రౌండర్ల'లో ఒకరు ఈనాడు లెగ్ స్పిన్నర్స్‌లో మొదటివాడు

లోగడ, ముఖ్యంగా వెస్టుఇండీస్‌తో పోటీలలో ఫాస్ట్ బౌలింగును ఎదుర్కొనే నైపుణ్యం మన ఆటగాళ్ళకు లేదని ఋజువు అయినది. స్లో, స్పిన్ బౌలింగును ప్రతిఘటించే నేర్పూ శూన్యమేనని ఢిల్లీ టెస్టు ఋజువు చేస్తున్నది. ఆస్ట్రేలియా కాప్టెన్ రిచీ బేనాడ్ మొత్తం 76 పరుగులకు అయిదు వికెట్లు తీసుకొన్నారు. క్లిన్ రెండవ ఇన్నింగ్సులో 42 పరుగులకు నాలుగు వికెట్లు తీసుకొన్నారు.

ఈ టెస్టులో మనదృష్ట్యా చెప్పుకోవలసిన విశేషం ఒక్కటే. పంకజ్ రాయ్ విశేషమైన సామర్థ్యం ప్రదర్శించి 305 నిమిషాలసేపు ఆస్ట్రేలియా బౌలర్లను ప్రతిఘటించి నిలిచి 99 పరుగులు చేశారు.

వెస్ట్ ఇండీస్ ఆటగాళ్ళను సమర్థంగా ఎదుర్కొన్న మిల్కాసింగ్ వంటి యువకులకు ఇతోధికమైన అవకాశాలు కల్పించి వారిపైనే ఆధారపడితే తప్ప క్రికెట్‌లో మనస్థాయి పెంపొందే ఆశ కనుపించదు.

—కామరాజు.

(...వ పేజీ తరువాయి)

...కాల్ గురించి గూఢ వ్యాసం వ్రాస్తే ...ందని నా అభిప్రాయం.

...తో చేతిపంచీలు" వ్యాసం కూడా ...గుంది. ఈ పంచిని చేయడానికి ...యత్నిస్తూ యున్నాను.

జి. వి. కె. కుమార్, మద్రాసు.

### న్యూఢిల్లీ లేఖ

...లేఖలలో శ్రీ కృష్ణగారు ఎంత ...ధాని నెహ్రూని విమర్శించడం ...మీ కనపడదు. ప్రతి లేఖలోనూ ... విదేశాంగవిధానాన్ని మరి ...తీసుకునిఅర్థం లేకుండా విమర్శించడం ...కృష్ణగారి పని. 9-12-59 సంచికలోని ... శ్రీ కృష్ణగారు చాలాఅర్థరహితంగా ...రారు. ఏ కాంతసౌధంలో కూర్చుని ...గానాలు చేస్తుంటారట శ్రీ నెహ్రూ. ...పైవాపట్ల ఆయన విధానానికి వారు ... భయపడుతున్నారు. బాధపడుతు...న్నారు" అన్నారు శ్రీ కృష్ణ. ఇక్కడ వారు అంటే ప్రజలంతా అన్నమాట. ఇది సత్యదూరం. శ్రీ నెహ్రూ విధానాన్ని ఎల్లప్పుడూ విమర్శిస్తుంటే శ్రీ రాజాజీ, శ్రీ డాంగే ప్రభృతులు సయితం శ్రీ నెహ్రూ విదేశాంగ విధానాన్ని, ముఖ్యంగా యీనాడు ఆయన చైనాపట్ల అనుసరిస్తున్న విదేశాంగ విధానాన్ని పూర్తిగా బలపరుస్తున్నారు. విదేశాలలోకూడా అందరూ సమర్థించారు. విమర్శించినవారులేరు. మరి శ్రీ కృష్ణ ఎంతమంది ప్రజల అభిప్రాయం తెలుసుకొని యీ విధంగా వ్రాశారో!

జి. రామశేషగిరిరావు, హైదరాబాదు.

శ్రీ కృష్ణగారి "న్యూఢిల్లీ లేఖ" ముద్ర వేలికలు త్రిప్పుతున్నది. వారియొక్క సునిశిత విమర్శ, సందర్భోచితంగా వారిచ్చే టటువంటి 'రిఫరెన్సులు' చదువుతూ ఉంటే వారెన్ని పుస్తకాలు చదివారో గదా అన్న ఆలోచన రాకమానదు. వారియొక్క మేధాశక్తి, రచనా నైపుణ్యమును పరిశీలిస్తే మరల్పు కొందామన్నా వారి ఆలోచన తిప్పితే మరలేరాదు. పెద్దమనుష్యులుగా చలామణీ అయ్యే రాజకీయ ధురంధరుల వెనుక ఉన్న కల్మషాన్ని యథాతథంగాను, నిష్పక్షపాతంగాను విమర్శించటమే గాకుండా, ఒక వారంలో జరుక్కుపోయే ముఖ్యమైన రాజకీయ, సాంఘిక ముఖ్యాంశాలను క్లుప్తీకరిస్తూ వారి రచన ద్వారా వారుచేసే సేవను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

సి. యస్. కె. శర్మ, పొన్నూరు.

### ముఖచిత్రం

ఆంధ్రసచిత్ర వారపత్రిక (16-12-59) అట్టమీద బొమ్మ చాలబాగుంది. ఎప్పుడూ చూచే సినిమా తారల చిత్రాలకు బదులు ఈ చిత్రం వేసినందుకు నా అభినందనలు. ముఖచిత్రమే బాగుందనుకొంటే

**Regd No. M. 4479 Andhra Patrika Illustrat eekly.**



# పాండ్స్

## కోల్డ్ క్రీమ్

★ శుభ్రపరుస్తుంది

★ అందము కలిగిస్తుంది

★ రక్షణనిస్తుంది




ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మము లోపలికి చొచ్చుకొని దుమ్మును తీసివేసి మీ చర్మమును మృదువుగా, మనోహరముగా ఉంచుతుంది. అద్భుతమైన పాండ్స్ కోల్డ్ క్రీమును క్రమముగా వాడితే మీ ముఖవర్చస్సు నిర్మలముగా, అందముగా ఉంటుంది.

వ్యానిషింగ్ క్రీమ్ : పౌడరును రాసుకొనేముందు జిడ్డులేని పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడండి. అది పౌ... గంటల తరబడి ఏకరీతిగా అంటుకొని ఉండేలా ఉంచుతుంది మరియు మీ లావణ్యమునకు రక్షణ నిస్తుంది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్. ఎ లో స్థాపితమైనది)